శ్రీరస్తు.

# పాండవాజ్ఞాతవాసము.

బ్రహ్మశ్రీ, జనమంచి శేషాద్రిశర్మకృతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1921.

# విజ్ఞప్తి.



రసికశిఖామణులారా!

నాటకలక్షణముల నెల్ల నెఱింగిన మీకు నేను విన్నవించుకొనఁదలఁచిన విషయములు క్రొత్తవిగావు. అయినను జాపల్యమున విన్నవించుకొనుచున్నాఁడను. "నాటకాంతంహి సాహిత్యమ్" అనుట సుప్రసిద్ధము. ఈసూక్తివలన నాటకములయం దేదో యొకయద్భుత ముండి తీఱవలయునని తేలక మానదు. కావ్యములకంటె నాటకము వ్రాయించుటలోఁ గష్టము దోఁపదు. మఱెందుకీసూక్తి? అన నిందుపమానరహిత రసప్రవాహము గలదని చెప్పక తప్పదు. ఒక్కొక్కమాటయుఁ దూఁచినట్లుండవలయును. అనఁగా రసమయముగ నుండవలయును. శృంగారవర్ణనమున శ్రుతికటువులగు పదములకూర్పు, యుద్ధవర్ణనమున సులలితపదములకూర్పు మొదలగునవి వర్జింపఁదగినవి.

పాత్రప్రవేశమున కొకహేతువుండవలయును. అసందర్భముగఁ బాత్రము రంగస్థలమునఁ బ్రవేశింపరాదు. అట్లు ప్రవేశింపఁజేసినచో నది కవిశక్తిన్యూనతను వెల్లడించును. పాఠకులు బుద్ధిమంతులగుచో పెదవివిఱుతురు. పూర్వోత్తరసందర్భానుసారముగఁ బాత్రప్రవేశమును గల్పించుటయు, రసముచెఱుపని వాక్యములు పద్యములుపయోగించుటయుఁ గవికిఁ బ్రధానకార్యములు. కవిదృష్టి యీరెండుకార్యములపైఁ బ్రసరింపదేని యతఁ డంధుఁడనియే చెప్పఁదగు.

ఇఁకఁ బ్రకృతపునాటకవిషయమై నాల్గుమాటలు మనవి చేయందలంచితిని.

పాండవులు పండ్రెండుసంవత్సరము లరణ్యవాస మొనరించిరి. పదుమూఁడవయేఁట నజ్ఞాతవాసవ్రతమూనవలసినవారైరి. ఆసంవత్సరమే వారికి దారుణతమమైనదనుటకు సందేహము లేదు. ఏమాత్రము భంగముకల్గినను మరలఁ బండ్రెండేఁడులువనవాసము. ఒక్కసంవత్సర మజ్ఞాతవాసము

జరపఁదగినవారగుదురు. ఇట్టియిక్కట్టుల నాసంవత్సరము వారు మెలఁగఁ దగిన దెట్లో, వారియం దాదృతిగల బంధుమిత్రు లెట్టిన త్రిపఁదగురో ఆలోచింపుఁడు.

కౌమార్యాదులగు నాశ్రితులు, వారినివదలిరి. వారిజాడ తమకుఁ దెలియనట్లే ప్రవర్తించిరి. శ్రీకృష్ణాదిబంధువులు అట్లే ప్రవర్తించిరి. ఇంతయేల పాండవులు ధర్మాత్ములని మెఱింగినవారెల్ల వారికానంవత్సరవ్రత మెట్లు గడచునా, ఎట్లు కృతకృత్యులయి శత్రుధ్వంసముగావించి విజయశ్రీ విరాజమానులగుదురా యని విచారించుచునేయుండిరని చెప్పకతీఱునా !

ఇట్టి కష్టతరకాలము నెట్లోగడపి భగవదనుగ్రహపాత్రులుగాన గట్టెక్కిరి. గాఢాంధకారమును వెలిఁద్రోచి పొడసూపిన చండమార్తండు నివిధంబునఁ బ్రకాశించిరి.

ఇట్టికథ నాటకముగా వ్రాయునపుడు వారిగౌరవమునకు భంగము రానీయక వారిభృత్యభావమును సమర్థింపవలసియుండునుగదా !!

విరాటుఁ డుత్తమనాయకుఁడు. ఆతని యంతఃపురము పరమపవిత్రమైనది. తత్పుత్రియగునుత్తర యుత్తమశీల. ఇట్టి వారియందు కళంకముగలదని తోఁచునట్లు కవి కథలను గల్పింపరాదు. కల్పించినచో దోషి యనంబడును. నాటకముం జూచువారలకుఁ బూర్వపురాజకుటుంబముల చర్యలు తమకు దృష్టాంతభూతములుగా నున్నవని తోఁచునట్లు వ్రాయవలయునే గాని దురాచారములు వారియందున్నట్లు తోఁపఁజేయు కల్పనలఁ గల్పింపరాదు.

అభిమన్యుఁడు మహావీరుఁడు. శ్రీకృష్ణుని మేనల్లుఁడు. అర్జునునకుఁ బరాక్రమమునఁ దీసిపోవువాఁడు కాఁడు. అట్టి మహావీరుఁడు తండ్రుల యిక్కట్టులనెఱిఁగియుఁ దనతండ్రుల వెనుక నెలకుముందుగా విరాటునిపురికి బ్రాహ్మణవేషమున నరుగుటయు, అందు కంకభట్టు మొదలగువారు తనతండ్రులని తెలిసికొని వీథిలో వారినిబహిష్కరించుటయు, వారు ఛీపొమ్మనుటయు వినఁ జనుపఁదగని కల్పనలుగాక మఱెట్టివి ? అభిమన్యుఁడు నిద్రపోవుచుండ నుత్తరవనవిహారమునకుంబోయి యాతనిం గాంచి మోహించుటయు, అంతలో నొకపామువచ్చుటయు, క్షత్రియవరేణ్యపుత్రికయుఁ బ్రౌఢయునగు

నుత్తర దానిం జూచినంతనే 'కుమార్యా మొత్తో' యని యూర్చి మూర్ఛిల్లుటయు సర్వప్రకారముల రసవర్జ్యములు గదా. మానసీయశీలయగు క్షత్త్రియవరపుత్త్రి యిట్లు భయపడెనని కల్పించుట యొకగొప్పలోపము ! అసంగతము !! రసభంగము !!!

ఇట్టి యసంగతపుఁగల్పనల కవకాశమీయక వ్రాసితినో నీపరమపవిత్రచరిత్రము చదువువారలకును, నాటకమును బ్రదర్శించుచుండఁ జూచువారలకును సంతోషదాయకముగా నుండును.

ఇంక రంగములనుగూర్చి నాలుగుమాటలు వ్రాసెదను. నాటకస్థలమునకే రంగమని పేరు. అందులో నొక్కొక్క యంకమున నియమమే పాటింపక తోఁచినన్ని రంగములను గల్పించుట యొక క్రొత్తరసహీనపుఁ బద్ధతి. అట్లు కల్పించుటలోఁ గవితాలుమానించుచుండుటయుఁ గలదు. యవనికమార్పఁబడుచున్నప్పుడెల్లను నిది యిన్నవరంగమండీ యని చూచువారలకుపదేశించుటయే యీ మహాకల్పనకు ఫలమేమో, ఆహా! ఏమి గసము ? ఏమికల్పనము ? ఏమిపాండిత్యము ?

ఆర్యులారా! నాటకము దృశ్యప్రబంధముగాన నట్టిదానిని రచించునప్పుడు కవిజాగరూకుఁడై లోకులకు నీతిబోధించుటయే ఫల మీనాటకమునకని తెలిసికొని వ్రాయవలసియుండునే గాని దుర్నీతిని బోధించుటకుఁ గాదని మీనుండి నేర్చుకొన్న యీయొక్కమాటనే మరల మిమ్ముఁగూర్చి మనవి చేయుచున్నాఁడను. వాక్చాపల్యమును సహింతురుగాక.

ఈ నాటకమున మహాత్ముఁడగు తిక్కనసోమయాజిగారి పద్యముల యర్థమునే చాలభాగము గ్రహించితిని. రసమున్నచో వారిదని, విరసము గనున్నచో నాదియని గ్రహింపఁజను.

ఇది వ్రాసిన కొలఁదిదినములకే నాయందు దశ్యంతాదృతిగల్గియున్న మ॥ రా॥ శ్రీ వావిళ్ల. రామస్వామిశాస్త్రులుగారిపుత్రులు, నానాదేశసంవ్యాప్తకీర్తిమల్లికామతల్లికావతంసులు, పరోపకారపారీణులు, విద్యార్థిజనకల్పకప్రతిములునగు శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు ముద్రించి నన్ను సఫలమనోరథునిఁ గావించిరి.

మఱియొక్క మనవి: —

నాకు సంగీతజ్ఞానమంతగా లేకున్నను నామిత్రులు పాటలు కొన్ని కూర్చిన నిందుఁ జేర్పఁదగునని హెచ్చరించినందున విధిలేక యంగీకరించి నాకుం దోఁచినట్లు వ్రాసియీయఁగా వానికిందగిన రాగతాళముల నమర్చి నాకష్టమును దీర్చినవారు కడపపుర వాస్తవ్యులు బ్ర॥శ్రీ మేడవరపు జన్నయ్యగారే యని విన్నవించి యీనాటకమునందుఁ దెలిసియో తెలియకయో నాచేసిన తప్పులను దెల్పి నాచేతనే దిద్దింపుఁడని మిమ్ముఁ గోరుచున్నవాఁడ.

“కింవా స్వార్థనయా పరోపకృతిషు స్వాభావికస్సద్గుణః” అనుసూక్తి నామది గట్టిగా నాటియున్న దనియు విన్నవించుచున్నవాఁడ.

ఇట్లు పండిత పాద సేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.

# ఇందువచ్చు పాత్ర నామములు.

## పురుషులు.

ధౌమ్యుఁడు
పంచపాండవులు
దుర్యోధనుఁడు
దుశ్శాసనుఁడు
కర్ణుఁడు
శకుని
విరాటుఁడు
కంకభట్టు
మంత్రులు
కీచకుఁడు
బృహన్నల
ఉత్తరుఁడు
భీష్ముఁడు
ద్రోణుఁడు
కృపుఁడు
అశ్వత్థామ
శ్రీకృష్ణుఁడు
అభిమన్యుఁడు

## స్త్రీలు.

ద్రౌపది
సైరంధ్రి
చండిక
కీరవాణి
సుధేష్ణ
ఉత్తర

వీరుగాక సందర్భానుసారముగ నింకను గొంతమంది వత్తురు.

# పద్యములయందుఁబడిన యచ్చుతప్పులకు సవరణలు.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 30 | 19 | యాజగ | యాజిగ |
| 45 | 5 | కాదురు క్తుల | కామదురు క్తుల |
| ,, | 23 | నఖంలుఁలం | నఖంబులం |
| ,, | 26 | తాంతపురి | తాంతుపురి |

శ్రీరస్తు.

# పాండవాజ్ఞాతవాసము.

---

## ప్రస్తావన.

### నాంది.

శా. శ్రీకల్యాణగుణాభిరాముఁడగుచున్ ♦ శృంగారనారాశియై
వీఁకన్ శాత్రవకోటి పెంపడఁచి యు♦ర్వీభారముం దీర్ప న
[1]స్తోక ప్రాభవమొప్పు ధాత్రిపుఁడు సం♦శోభిల్లు శ్రీరామునిన్
శాకారిప్రముఖార్చితాంఘ్రికమలుం ♦ బ్రార్థింతు భద్రాప్తికై. 1

## ౧ పాట.

సూత్రధారుఁడు:—(నాంద్యంతమున మహానందముతో దిక్కులుపరికించి) ఔరా! రసికశిఖామణులచే రంగస్థలమంతయు నింతలోనే నిండియున్నదే.

ఉ. చాగుమృదంగనాదములు♦ సర్వబుధస్తుతిసేయుమాడ్కిఁ జె
న్నారెడుఁ బ్రస్తరప్రతతి♦ నన్నువవే నొనగించు వస్త్రపం
[2]క్తిరన మొల్లసభ్యుల సు♦చిత్రములం బ్రసూదాబ్ధిముంచుచున్
హారిసరంబుగా నెలసె♦ నౌర! యిదే సభ చూడ నొప్పెడున్. 2

(ఆకాశమునకుఁ జూడ్కి నిగుడించి) ఇంతకాలమునకు దురంతదుర్దినములు తొలఁగి దిక్కాంతాముఖంబులు తేటనొందినవి.

చ. సరసులు సద్విజాభిరతిఁ♦ జక్కనికాంతి వహింపఁగా మనో
హరగతి మిత్రమండలము ♦ హర్షముతోడఁ జరింపఁగా ద్విజే
[3]శ్వరుఁడు లసత్కళలను♦ సంతసపూర్ణుఁగ శారదాగమం
బరుదుగ మించె సత్సభము ♦ లద్భుతరంబుగఁ జూడ నొప్పఁగన్. 3

---

1. ఇది పదునెనిమిది పదములుగల నాంది. ఇందు శత్రునిగ్రహణము ప్రధానకృత్యముగాఁ గలిగి సకలకల్యాణగుణధాముఁడగు రామునివర్ణించుటచే సద్గుణాలంకారుఁడై శత్రువులనిర్మూలించు నర్జునుఁడు సూచింపఁబడుచున్నాఁడు.

2. ఇది రంగస్థలప్రసాధనమను ప్రస్తావాంగము.

8. ఋతువు నాశ్రయించుటచే నిది భారతీవృత్తి.

(దృష్టిమరలించి సభనుగలయంజూచి వినయముల( జేతులొగ్గి) రసికజన శేఖరులారా! నేను నాట్యవేదకళాపరిపూర్ణుఁడగు భరతాచార్యుని పుత్రుఁడను. నన్ను అభినవభరతోపాధ్యాయుఁడని పిలుతురు. మీరెల్ల నేఁడీదేనొక క్రొత్తనాటకము జూచి నాపాండిత్యమును జూపుటకు సెలవిండు. (ఆకాశము నంకకుఁ జెవినిడి) పాండవాజ్ఞాతవాసమను తెనుఁగునాటకము మీతరుణమునకుఁ దగియున్నది కాన దానినభినయింపుమని సెలవిచ్చుచున్నారా? (మహానందముతో) ఔరా! నాయదృష్ట మెంత యుత్కృష్టమైనది! నేననుకొన్నయట్లే నవరససారజ్ఞులగు నీసభ్యు లానతిచ్చిరి.

తే. నాటకం బిద్ది నవరస • పాటనంబు
[1]సభ్యులో సర్వవిద్యావి • శారదు లిఁక
నాట్యమున నద్వశంబుగ • న్నారు నాదు
పరిజనులు నుంతయేని లో • పమెటు గలుగు. 4

(ఇంచుక యాలోచించి) ఇంకను మానటి రాకయున్నది? ఏలొకో. పిలిచి చూచెద. ఆలస్యము చేయుట లోపమే యగును. (కొంచెము నడచి) ఆర్యా రమ్ము రమ్ము.

నటి:—(ప్రవేశించి) ఆర్యపుత్రా, ఇదిగో వచ్చితిని. కర్తవ్యమును జెప్పి నావలనఁ బనిగొనుఁడు.

సూత్ర:—ఆర్యా! నీశక్తిచే నీసభ్యుల నానందపయోరాశి మునుంగఁ జేసి నీపాండిత్యమును వెల్లడింపుము.

నటి:—(సంతోషముతో) నాట్యసామగ్రి చక్కఁగా సమకూర్పఁ బడినది కాని యిపుడు ప్రదర్శింప నగునగు నాటక మేదిఁ

సూత్ర:—ఈనాటకమును బ్రదర్శింపవలయును. (అని పత్రిక యిచ్చును).

నటి:—(పత్రికను గ్రహించి).

తే. సూపనామధేయంబుల • నేపగిదిని
దెలియరాకుండ నింతితోఁ • గలిసి వ్రతముఁ
జక్కనెఱవేర్చి వైరుల • సమితిఁ జెండి
యలఘువారల కథ గాంచ • నౌను నేఁడు. 5

(అనిపఠించి) ఆర్యపుత్రా! ఇందలికథ యెద్దియో తోఁచకయున్నది. చక్కఁగాఁ దెలియఁ జెప్పుఁడు

1 ప్రస్తుతవిషయప్రశంసచే సభ్యనభివర్ణనముగాఁ జేసికొనుటచే నిది ప్రరోచన.

సూత్ర:—లేలా! ఇందలికథయే తెలియకపోయినదా. పాండవు లరణ్యమునఁ బండ్రెండుసంవత్సరములు గడపి యజ్ఞాతవ్రతచర్య నొక్కవత్సరము విరాటు పురంబున నడపి కృతకృత్యులైరని కదా దానియర్థము. ఈపాటి గ్రహింప లేక పోతివికదా!

నటి —ఆహా! చక్కఁగాఁ దెలిపితిరి. కాని యీనాటకము నొనరించిన కవి యెవఁడుఁ

సూత్ర:—ప్రేయసీ! చక్కఁగాఁ బ్రశ్నించితివి. వినుము.

సీ. ఆంధ్రభూసురకుల♦మం దుద్భవం బంది
యాదిని స్కాందంబు♦ నవల లలిత
సత్కథలను దెల్పు♦జాలు నుపాఖ్యాన
మంత బ్రహ్మాండాహ్వ♦యమున నలరు
ఘనపురాణము నాది♦కావ్యమౌ రామాయ
ణము నాంధ్ర భాష యొ♦నర్చి వెలయు
జనమంచి శేషాద్రి♦శర్మ యీపాండవా
జ్ఞాతవాసం బను♦సరసనాట
తే. కమును రచియించె వావిళ్ల♦విమలవంశ
మౌక్తికమునాఁగ జగమున ♦ మహిఁ గీర్తిఁ
గాంచి సాధుమనీషుఁడై ♦ మించుచున్న
వేంకటేశ్వరశాస్త్రి య♦భిమతరీతి. 6

ఈనాటకమునభినయించి యీ సభ్యుల నానందరసాంబుధి నోలలాడింపవలయుఁ జుమీ.

నటి:—ఆర్యపుత్రా! విచిత్రపాదుకాపట్టాభిషేకము రచియించినది యిక్కవియే కాదా?

సూత్ర:—అవునౌను! ఆచమత్కృతి నంతయుం జూపి యిఁక నీ సభాస్తారులఁ జిత్రప్రతిమలవలెఁ జేయవలయుఁ జుమీ.

నటి:—మీయనుగ్రహమున్న నదెంతటిపని! కాని యీనాటకకథ స్పష్టముగా నాకుం దెలియఁజెప్పి యనుగ్రహింపుఁడు.

సూత్ర:—ముద్దరాలా! మరల నానోటఁ జెప్పింప నిట్లడుగుచున్నట్లున్నది. విను

సీ. ప్రతిన చేసినరీతిఁ♦ బాండవు లజ్ఞాత
వాసము నెఱవేర్పఁ♦బయనమగుట
ధర్మదేవతవర♦దానసమాగత
తనువుల వేర్వేఱ ♦ దాము గొనుట

విరటునిపురిఁ జేరి ♦ మరియాద దప్పని
యుద్యోగముల నీయ ♦ నొప్పుకొనుట
దుర్యోధనుఁడు వీరి ♦ త్రోవ నారయఁ గోరి
విరటుగోవుల నొక్క ♦ విధిని గొనుట

**తే.** దక్షిణమునకు విజయుండు ♦ తప్ప నితరు
లుత్తరమునకుఁ బార్థుండు ♦ నోలిఁ జనుట
కౌరవుల నాజి నోడించి ♦ ప్రబలుటయు
నాదిగాఁ గల్గు కథలిందు ♦ నమరియుండు. 7

**నటి:**— చక్కని నాటక మిది కథయుఁ బావనమైనది రమ్యతరమునై యలరారుచున్నది. ఇఁక నాలస్యమున కీసభ్యు లోర్వరని తోఁచుచున్నది. కావున నింకఁ జేయఁదగిన కార్యమునకుఁ బ్రయత్నించుట మంచిది.

**సూత్ర:**— ప్రియురాలా! సరసముగా జ్ఞాపకము చేసితివి? ఇదిగో సకలశ్రేయఃప్రాప్తికై గురుస్తుతిం జేసెద.

**ఉ.** ఆపదలొందకుండఁ దగి ♦ నట్టి యుపాయము లెన్నొ నేర్పుచున్
[1]దాపముఁ బాపునట్టి ఘన ♦ ధర్మము లాదృతిమీఱఁ దెల్పుచున్
బాపవినాశకంబులగు ♦ పద్ధతు లారసి బోధచేయుచున్
శ్రీపతిరీతి నొప్పు గురు ♦ శేఖర! ముఖ్యులఁ బ్రీతిఁ బ్రోవుమా. 8

(నేపథ్యమున) ఇదిగో వచ్చుచున్నవాఁడ మీకు నిఖిలశ్రేయస్సు లొసఁగూడు ధర్మపద్ధతులను దెల్పెద భయపడకుఁడు. విచారము మనస్సులఁ జొప్పింపకుఁడు. సంశయింపకుఁడు. ధర్మదేవత మీపక్షమున నున్నది భవిష్యచ్ఛుభప్రాప్తికై కొన్ని యుపాయములఁ దెల్పెద.

**సూత్ర:**— ప్రియురాలా! నేఁ గావించిన గురుస్తుతిని దవదిగా నెంచి పాండవులగురు వగు ధౌమ్యముని వచ్చుచున్నాఁడని యూహింపవలసి యున్నది. (అని పురో[2]భాగమునఁ జూడ్కి సారించి (అదిగో ధౌమ్యమహర్షి పాండవులఁ జూచుట కత్యంతవేగమున వచ్చుచున్నాఁడు మన మిఁకఁ జేయఁదగినపనికై పోదమురమ్ము.

(అని నటీసూత్రధారులు నిష్క్రమించుచున్నారు)

(ఇది ప్రస్తావన)

---

1. ప్రవృత్తికాలగుణవర్ణనముఁ జేసిన నిది ప్రవృత్తికము. ఇదియే కథోద్ఘాతము.
2. "అదిగో" అని నిర్దేశించుటచే నిది ప్రయోగాతిశయము.

# ప్రథమాంకము.



(గురువగు ధౌమ్యుఁడును పాండవులును ద్రౌపదియు నరణ్యభాగమునఁ బ్రవేశించుచున్నారు.)

ధౌమ్యు:—ధర్మనందనా! మనస్సున సంచలతయు విచారము వలదు. నిరుపమ కరుణానిధి యగు పరమపురుషుఁడు శ్రీకృష్ణుఁడు మీపై నుండఁగలఁడు. ఎట్టి యిక్కట్టులును మీకు సంభవింపవు. సర్వాచరమానస్సుతో నియమాలిపర్య జరపుము. అవల దిగ్విజయము, రాజ్యప్రాప్తియు నగును.

ధర్మ:—(డగ్గుత్తికతో) మహాత్మా! తమ యాశీర్వచన ప్రభావంబున నెట్లో పండ్రెండు సంవత్సరంబు లరణ్యంబున గడపితిమి. ఇఁక నొకసంవత్సర మెవరెవ్వరికిని తెలియంగకయుండ నొకచో నుండవలయు. ఇందుఁ బ్రమోద మించుకంతయేనిఁ బొందితిమా? మరల నరణ్యంబునఁ బండ్రెండు సంవత్సరము లుండి యొకయేఁ డజ్ఞాతచర్యఁ గాలము గడుపవలయునని నియమము కదా. (ఆకాశముం గాంచి కన్నీరు నించి) అయ్యో!

చ. నిరుపమతేజముల్ వెలయ ♦ నిర్జరులౌదురు పేరె యంచు నె
వ్వరికిని దోఁపఁ జేయు రుచి♦ భాసురదేహము లొప్పు సద్యశం
బరుదుగ దిక్కులం బొదల ♦ నాయతబాహుబలంబు పొంగఁగా
ధరణిని మించు సోదరులు♦ దైన్యము నొందిరి నాకితంబునన్. 1

ధౌమ్యు:—మహారాజా! ఇట్లు విచారమున నిమగ్నులగు నీతమ్ముల ధీరత్వ మేమగునో తలంపుము. ఇదియంతయు విధివశమున జరగినపని. దానికి వగచిన లాభమేమి? నేఁటితో నరణ్యవాసపరిమితి గడచును. రేపటినుండి మీ రితరుల కెఱుకపడక యుండ నుండవలయు. ధైర్యమూని యిక్కార్య మెట్లు కొనసాగునో చింతింపుము. కాలహరణము చేయరాదు. శత్రువులు చారులం బంపి మీ తెఱంగరయుచుందురు. కపటనది యిప్పుడే యని యూహించి కార్య మెట్లు సరిపడునో యనుపాయము నిశ్చయింపుము, మధ్యాహ్నము దాఁటినది. జాము ప్రొద్దున్నట్టులున్నది.

ధర్మ:—గురువర్యా! నా కేమియుఁ దోఁపకున్నది. అజ్ఞాతచర్య యనుమాట మనోవీథి యందుఁ దోఁచిన నా దేహము కంపమొందుచుండును. రేపటినుండిది యనినంత నే కన్నులు కానరాకున్నవి. ఏమి నాగతి? ఎట్లుగాఁ గాలము గడపుదుమో, ఈ దుర్దినము లెట్లు గడచునో అపత్సముద్రమును దీని నెట్లు తరింపఁ గలమో నాకేమియు నూహింప శక్యముగాక యున్నది. ఏమి యుపదేశించినను, ఏదారి చూపినను మీరే గాని నాబుద్ధి నాస్వాధీనమున లేదు (అని దుఃఖించును.)

ధౌమ్య:—మహాత్మా! ధర్మరాజా! నీ వేల యిట్లన్న నే నేమనఁ గలను? దేవతలకైన నొక్కొక్క సమయమున నిక్కట్టులు వాటిల్లు. దానిం దాఁటి వారానందము నొందలేదా. వినుము వివరించెద.

సీ. నిషధాచలంబున ♦ నిర్జర నాథుండు
ప్రచ్ఛన్న రూపవ ♦ ర్తనము గనుట
యదితిగర్భంబున ♦ నంభోజనాభుఁ డా
యమరకార్యమునకై ♦ యడఁగి యుంట
ధేను దేహంబున ♦ దినకరుం డజ్ఞాత
వర్తనంబున నొక్క ♦ భంగి నుంట
ఋతుపర్ణు నింటిలో ♦ నతి దీనవృత్తిమై
నలమహీశుఁడు చర్య ♦ సలిపి యుంట
మనము వినమె వీర ♦ లును దమకార్యముల్
దుదకు సిద్ధినొంద ♦ ముదము గనరొ
యట్లె నీవు గూడ ♦ నాపదలకు నోర్చి
కోర్కె నెల్లఁ దీర్చు ♦ కొనుము భూప. 2

ధర్మ:—మహానుభావా! మీయుపదేశ మమోఘము. అజ్ఞానమును బోఁగొట్టునది. దానం గొంత తెల్వి నొందఁగలిగితిం గాని యిట్టిసంవత్సరము గడపి కృతకృత్యుఁడ నగుదునా యను శంక బాధించుచున్నదే ఏమిగతి?

ధౌమ్య:—ధర్మనందనా. రాజసూయాధ్వరంబు సేయునప్పుడును, లక్కయింటి యాపద తప్పినప్పుడును సాయపడిన భగవంతుఁడు మీకెల్లవేళలఁ దోడునీడ గనుండ నీస్వల్పకార్యమును దీర్చుకొని కృతకృత్యు లగుట యొక యబ్బురమా, నామాట వినుము.

చ. అనిశము దేవకీతనయుఁ డాపదమేనుఁ బ్రీతిమీఱఁగాఁ
[1]గనుఁగొనుచుండ, ధర్మమును గామదయుఙ్మిముఁ గాచుచుండఁగా
జనవర! సత్యమెల్లపుడు సాయముగా నలరారుచుండ నీ
పని యొకయుద్యమంబె యొక భంగము గల్గకె సాగెనుం జుమీ. 3

ధర్మ:—(నిట్టూర్పువుచ్చి) గురువర్యా? ఆకరుణాకరుండగు శ్రీకృష్ణుఁడు కంటిని రెప్ప వలెఁ గాపాడకయే పోయిన మే మేలోకమున నుందుమో. తండ్రి లేని కొఱంత మాకు లేదు గా.

ధౌమ్య:—ధర్మరాజా! చక్కని యభిప్రాయ మిది. ఆమహామహునికరుణయే లేకు[2]న్న మీకువచ్చిన యాపత్కల్లోలమాలికలలో నెప్పుడో యడంగి యుందురా. అట్టి శ్రీకృష్ణుని కరుణకుం బాత్రులుగా నుండుటంబట్టియే మీ కీయాపద తొలఁగి నిష్కంటకరాజ్యము లభింపఁ గలదు.

ధర్మ:—మహాత్మా తమయాశీర్వచనప్రభావము వలనను, శ్రీకృష్ణభగవానుల కరుణవలనను దుర్భరాజ్ఞాతచర్యసుఖముగాఁ గడచి మంచికాలమువచ్చుఁగాక. (కొంచెమాలోచించి) సాయంకాలము వచ్చుచున్నది. రేపటినుండియే గదా. అజ్ఞాతచర్యప్రారంభము కావలయు (గుండెలు గుద్దుకొని) అబ్బా! పండ్రెండుసంవత్సరములు గడచినవి కదా. 'అందనిపోకయెత్తు అగస్త్యుఁ డొక్కరుఁడు' త్తిన్నట్లు ఒక్కసంవత్సరమే యైనను దుస్సహముగఁ దోఁచుచున్నదే. ఇంకేమి గతి?

ధౌమ్య:—వత్సా! అట్లు దిగులొందినఁ గార్య మెట్లు జరపఁబడును. ధైర్యమూని భగవంతుని నమ్మి త్వరపడి కార్యారంభమున కుపాయ మాలోచింపుము.

ధర్మ:—చిత్తము (తమ్ములవంకఁ జూచి కన్నీరువిడుచుచు డగ్గుత్తికతో) నాప్రియసోదరులారా!

చ. వనముల ద్వాదశాబ్దములు నైగమమూలలఁ జిక్కకుండఁగా
వనజదళాక్షు సత్కరుణ వర్ధిలుటన్ గురువర్యు నాశిషం
బున జరపంగ నయ్యె నొక పోలిక రాఁగల వత్సరంబు నె
మ్మనమున కార్తిఁ గూర్చెడిని మాటలు వేయును బల్కనేటికిన్. 4

అర్జు:—అన్నగారూ! ఇంతకు ముందే కదా గురువర్యు లాశీర్వదించిరి.

---

1 ఇష్టదేవతాదిప్రసాదరూపమగు కథాబీజముపన్యసింపఁ బడుటచే నిది యుపక్షేపము.

2 ప్రాక్సూచితబీజ సమర్థనముచే నిది పరికరము.

ధర్మ:—నాయనా! సత్యమే కాని మనమేవురము పాంచాలిం గూడి యెచ్చటికిఁ బోయినను గుఱుతింపక పోరురా. కాన నెట్లు గడపఁ జనునని యే నా యుమ్మలికము.

అర్జు:—మహారాజా! ఆనాఁడు ధర్మదేవత మీనియమమునకు మెచ్చి వరములిచ్చెఁ గదా. అవ్వానిసహాయంబున సుకరంబుగా నీవత్సరంబును గడపఁ గలము. మనపగవారేమి చేయఁ గలరు! ఇచ్చటికి సమీపముననే పాంచాల చేది మత్స్య సాళ్వ విదేహ బాహ్లీక దశార్ణ శూరసేన కళింగాది దేశంబులు గలవు. అయ్యవి సకలసస్య సంపూర్ణంబులై, జనాకీర్ణంబులై, వాసయోగ్యంబులై యున్నయవియని వింటిముకదా. అందు మీకుం బోలిన జనపదంబున నుందము.

ధర్మ:—వత్సా! చక్కఁగా స్మృతికిం దెచ్చితివి ధర్మదేవతావర ప్రభావమున మనము కాలమును బుచ్చఁ గలము నాకుం జూడ మత్స్యదేశము మన కనుకూలమని తోఁచెడిని. ఆదేశాధిపతిని ధర్మమతియు, బాహుబలోదగ్రుఁడును బ్రజారంజన తత్పరుండునని విన్నాఁడను. కాఁబట్టి యట మనము నిలుచుట యుత్తమమని నా తాత్పర్యము. కాని. నెవ్వరెవ్వ రేయే విధంబున విరటుని చిత్తవృత్తి ననుసరించి యుండఁ గలరో ముందుఁ దెలిసికొనవలయుఁగదా ఆవిధము చెప్పుఁడు.

అర్జు:—(కొంచె మూరకుండి కన్నీరు నించుచు) మహాత్మా! రాజచంద్రమా!

ఉ. ధర్మపథంబున న్నిలిచి ♦ తత్త్వవిదుల్ వెఱగంది చూడఁగా
నిర్మలచిత్తుఁడే సుకృతి ♦ చేర్పుతి యంచు నుతింప వైరిరా
డ్భర్మకిరీటరత్నరుచి ♦ భాసురపాదనఖుండ వైన నీ
వర్మిలి యీఱ నవ్విరటు ♦ నాదృతి గాంచిచరింతు వెవ్విధిన్. 5

ధర్మ:—(తమ్ముని మనోదుఃఖము దలపోసి దానిం దీర్ప నెంచి) వత్సా ఏలయట్టి విచారము మనస్సునఁ బాదుకొల్పెదవు నా వర్తింపురీతి వినుము

మత్త. కొంకొకింతయు లేకయే చని ♦ క్షోణిపాలకుఁ గాంచి నేఁ
గంకనాముఁడ ధర్మనందను ♦ గౌరవంబునఁ బొందితిన్
బొంక మూఁసి సమస్తవిద్యల ♦ భూరిపాండితిఁ గాంచితిన్
శంక యేమిఁక నన్నుఁ గొల్చెద ♦ సాధువృత్తిని భక్తుఁడన్. 6

అనిపల్కి— విరాటుని మెప్పుఁ బడసెద. వినోదకథాగోష్ఠి నారాజన్యుని సంతోషపరవశుం జేసెద. ద్యూతంబున నాతని వశపఱచుకొనియెద. ధర్మసందేహములు గలిగినతఱి వానిం దీర్చి నా పాండితిం జూపెద. కనకరజత మణి నిర్మిత

ములగు నడ్డసాలులు నాయొద్దఁ గలవు. వానిఁ జూపి నాద్యూత చమత్కృతి నెఱపెద. వత్సా! అర్జునా! నావిషయమై సందియ మొందకుము. (అని భీముని వంకఁ జూచి కన్నీరునించు డగ్గుత్తికతో)

తే. మనల నాపదలం జిక్కి ♦ మ్రందకుండఁ
గాచినాఁడు భుజాబల ♦ కలితుఁ డెంకు
దైన్యముం బొందఁ డీమరు ♦ త్తనయుఁ డెట్టు
లోకరివంచల మెలఁగునో ♦ కోయెఱుంగ. 7

భీము:—గంభీర స్వరముతో

మత్త. ఏను వంటలవాఁడనై మను ♦ జేంద్రుఁ గొల్చెద నేర్పునన్
మానసంబున కింపుఁ బెంచెద ♦ మాడ్కి వంటలఁ జేసినే
నానరేంద్రుని మెప్పుఁ బొందెద ♦ నప్పురంబున నేపనిం
గాని నన్నిఁగులంగ లేనటు ♦ గాఁ జెలంగెద భూవరా. 8

మఱియు మల్లయుద్ధంబున మల్లురనెల్లఁ జెండి గట్టిజెట్ట యనిపించుకొనియెద. ఇంతయేల వంటయందును, భుజాబలకృత్యంబులం దీతఁడే జగంబున మేటియని రాజునకుఁ దోఁచునట్లు ప్రవర్తించెద. విరటుని మనస్సేవిధంబునఁ గరఁగునో యట్లు వర్తించెద. వలలుండను పేరు ధరించి యుండు. నీవెవ్వరివాఁడవని యడిగిన నాలవజాతివాఁడనని చెప్పి మున్ను పాండవాగ్రజునకు బానసంబు సేయుచుండుదు. విధివశంబున నామహానీయుఁడు రాజ్యభ్రష్టుఁడైయటకో పోయిన నిటు వచ్చితి. నన్నుం బరీక్షింపుఁడని పలికి, గౌరవంబునకు హానిలేకుండ నుండెద. మహీపాలకా! నావిషయమై యిమ్మలికంబు నొందవలదు.

ధర్మ—(విషాదముతో నర్జునునివంకఁ జూచి) అయ్యో!

ఉ. ముప్పదిమూఁడుకోట్లు సుర ♦ ముఖ్యులు తోడ్పడ నిర్జరేశ్వరుం
డుప్పరవీథి నిల్చి నిశి ♦ తోగ్రశరంబుల నొవ్వఁ జేయఁగా
డెప్పరమైన యయ్యనిఁ గ ♦ డిందిమగంటిమి మీఱ నింద్రు పెం
పొప్ప నడంచి ఖాండవము ♦ నుద్ధతి భస్మము చేసినట్టి నే
ర్పొప్పెడు నర్జునుం డిటుల ♦ నొందుఁ గొల్చెను నోక్కొ దైవమా.

అర్జు—(వినయముతోఁ జేతులోగి) మహాప్రభూ!

చ. సురపురి నన్ను నూర్వశియుఁ ♦ జూచి వరింపఁగ నొప్పకున్న నా
తరుణి నపుంసకుండవయి ♦ దైన్యము నొందు మటంచుఁ దిట్టె ని

ర్జరవిభుఁ డొక్కవత్సరమె ◆ శాపఫలంబును బొందు మంచు నా
దరమున శాపమోక్షమును ◆ దాని వచించెను గాన నే నిఁకన్. 10

స్త్రీరూపంబును ధరించి బృహన్నల యను పేరుపెట్టుకొని యంతఃపురమునఁ గలకన్నియలకు నృత్తముగఱపుచు విరటున కానందమును గల్గించెద. నీ వెక్కడ నుంటి వని యడిగిన ద్రౌపది కడనుండి యామె యాదృతికిం బాత్రభూతనై యుంటివని పల్కెద. కనుక ధర్మనందనా నావిషయంబున వగవఁ బనిలేదు.

ధర్మ — (నకులునిం గాంచి కన్నీరునించి మాట తొట్రుపడుచుండ) హా విధీ!

చ. తనులత సౌకుమార్యము ను◆దాత్తతయున్ ముఖచంద్రు సోయగం
బును దమయంతనే యితఁడు ◆ పూర్ణశరీరముగల్గు మన్మథుం
డని తెలుపంగఁ బొల్చు ఘనుఁ ◆ డంచు నెఱుంగక యుండ నెట్టివ
ర్తనమున సంచరించునో వి◆రాటుపురంబున నేమి పల్కుదున్. 11

నకు. —

క. నే నశ్వశిక్షకుఁడనై
భూనాథునిఁ గొల్తు గుఱ్ఱ◆ముల జాతులనే
ర్పూనినవాఁడనె గావున
నానరపతిచిత్తవృత్తి ◆ నరయఁగ నేర్తున్. 12

అశ్వంబులకు వలయు మందుల నెఱుఁగుదు. వాని నడిపించు పద్ధతియుం దాతి తెలిసినవాఁడఁ గదా. దామగ్రంథియను పేరం బ్రవర్తిల్లెద నెందుండి వచ్చితి వనిన ధర్మరాజునొద్ద నశ్వపాలకుఁడనై యుండినవాఁడనని చెప్పెద. విరటున కమితానందంబుఁ గల్గింపఁ జాలుదు. కావున మహాత్మా విషాదంబు విడచి సమాహితచిత్తుఁడవు కమ్ము.

ధర్మ — (సహదేవునిపైఁ జూడ్కి నిలిపి కన్నీరుఁ దుడుచుకొని యెలుంగురాల్పడ) అక్కటా!

తే. కుటిల మెఱుఁగ డహంకృతిఁ ◆ గూడఁ డార్య
సమ్మతుఁడు ధర్మపథమునఁ ◆ జనెడు ప్రోడ
యల్పవయసున నలరారు◆నట్టి యితఁ
డొరుల నెవ్విధి గొలువంగ◆నోపు నొక్కొ! 13

సహ: — (చిఱునవ్వుతో)

క. ధేనువ్రాతమునకుఁ బతి
నై నరపతి మెప్పుఁ గాంతు ♦ నాలఁ బిదుకఁగా
వానిని గదుపుగఁ జేర్పం
గా నేరుతు బెదరు వాపఁ♦గాఁ గల నధిపా. 14

తే. ఎందు నుంటివో తెల్పుమా ♦ యీ వటన్న
నీదు కడనుంటఁ దెలిపెద♦మోదమలర
నాహ్వాయంబు తంత్రీపాలుఁ ♦ డనుచుఁ బిల్వ
నగుచు వర్తింతు విరటుని♦యంతికమున. 15

ధర్మ:—(తవలో) సరే వీరి యుద్యమము బాగున్నది. ఈపద్ధతి సరిగా సాగుననియే తోఁచుచున్నది. ధర్మదేవత మనపక్షమున నున్నది గదా. (అని పాంచాలిం జక్కఁగాఁ గాంచి కన్నీరు నించి) అక్కటా!

## ౨ పాట.

ఉ. అన్నులమిన్న యిద్ధ సుగు♦ణాఢ్య మనోహరరూపశీలసం
పన్న యుదాత్తచిత్త యొక♦భంగిని గష్టము నోర్వలేదు తా
మన్ననఁ గాంచుచుండు నొక♦మాటు న దేపని గాని చేయలే
దన్నిట గౌరవంబు నెడ ♦ నన్యుల నెవ్విధిఁ గొల్వఁ జాలునో. 16

ద్రౌపది:—(వినయంబున ధర్మరాజు దిక్కు మొగంబై) మహానుభావా! సత్యనిరతా!

కం. సైరంధ్రీవేషంబున
భూరమణాంతఃపురంబు ♦ పొంతకు నరుగన్
నేరుతు నాతని దేవియు
గారవమునఁ బిల్వనంపఁ♦గాఁ జని యచటన్. 17

క. మాలిని యను పేరున భూ
పాలునిసతి యాత్మకిద్ది ♦ భవ్యమతియుస
చ్ఛీలయు నని తోఁచెడు గతి
నోలిన్ వర్తించు దాన♦నో రిపుహరణా. 18

నీచకృత్యంబులకు నన్నుఁ బంపవలదని ముందే యొప్పించుకొనియెద. సురుచిర గంధమును బూయుట, కస్తూరికాతిలకంబు దిద్దుట, పలుభంగుల వింతలు గుల్చు కునట్లు పుష్పహారంబుల నవరించుట, మణిహారంబులఁ జక్కఁగా నలంకరించుట నాపనులని యామెకు ముందే తెల్పి, పాంచాలి కడనుంటి నని చెప్పి యామె

మెచ్చుకొనునట్లు వర్తించి సత్ప్రవర్తనము నన్నుఁ జూచియే నేర్చుకొనవలయు నను నూహఁ బుట్టించి యేవిషయములందుఁ గాని ప్రమాదంపడక ప్రవర్తించెద. మనకులవృత్తంబుల కేకొంతయు రాకుండునట్లు మెలంగెద. తులువలు నన్నుఁ గాంచి మాతృభావంబును బొందునట్లు సంచరించెద. ఏవిషయమునను బరాకు నొందుదునేమో యని యనుమానింపవలదు. సైరంధ్రిజాతివారందఱిట్లే ప్రవర్తింతురని నమ్ముఁడు

ధర్మ:—పాంచాలీ దైవంబు నీకుఁ దోడై యుండును. క్రొత్తచోటు గాన నీవత్సరంబు గడచను దాఁక నెన్నికష్టములైనఁ బొంది మాగౌరవంబు నిలుపుము.

ద్రౌప:—నానేర్పు విధంబున భగవంతుని శ్రీకృష్ణుని ధ్యానించి మెలంగుచుండెద. మీరు నన్నే మరక కాచుచుండవలయు.

ధర్మ:—మీ మందఱు మేవిషయమునఁ గాని పక్షపాతము గనఁబఱుపఁ గూడదు. మీ మేర్పరచుకొనఁబోవు సంకేతము ప్రకారము నికుశల మరయుచుందుము. (అని తమ్ములకు రహస్యముగ నేమో చెప్పును.)

భీమాదులు:—అన్నగారూ! తమయానతి మఱువక ప్రవర్తిల్లెదము. ఎట్టి యిక్కట్టు లందుఁగాని [1]రహస్యమును బయలు పఱుపము. అగ్రహామూని దేహము తెలియక యేమనినైనను జేయుము. సంకేతస్థలముల మీరానతిచ్చిన మాటలతో మనోభావములఁ దెలుపుచుండుము. ఈరీతి డెట్టులో పుచ్చితిమా యావల మనమనోరథము నెఱవేఱును. తమరేవిషయమునఁ గాని సంశయము మాపై నునుచుకొనక నెమ్మదిఁ బ్రవర్తింపుఁడు. మాయోపినంతవట్టు మిమ్మనుసరించి సమయభంగము గాకయుండఁ బ్రవర్తించుచుందుము. అర్థాంతరోక్తులనే మీభావమును గనుఁగొనుచుందుము.

ధర్మ:—ప్రియసోదరులారా! మీరు నాయానతిని దాఁటుదురని నాకెప్పుడు ననుమానము గల్గదు. పెద్దవాఁడను గాన నేఁజెప్పవలసిన మాటలఁ జెప్పితి. గురుభక్తి పరాయణులరగు మీకు నేర్పవలసిన దేమియున్నది.

భీమాదులు:—[2] కువలయానందకరుండవై సన్మార్గవర్తివై సుమనస్సముదయసంతృప్తికరుండవై యలరారు రాజచంద్రు నిన్ను సహజవాత్సల్యమున లక్షివీక్షింపఁ గోరుచున్నది.

ధర్మ:—[3] వత్సలారా! గుస్తరమైన యీసంవత్సర మెట్లో గడచినతర్వాత మనకష్టములు తొలఁగి సుఖసంపదలు చేకూరుఁ గాక.

---

1. బీజనివృత్తిచే నిది పరిన్యాసము అర్థసంప్రధారణముచే నిది యుక్తి.
2. బీజానుకూల గుణవర్ణనము చేయుటచే నిది విలోభనము
3. సుఖాగమమును దెల్పుటచే నిది ప్రాప్తి.

భీమాదులు:—ఇఁక మనము చేయవలయుపనికిఁ గడంగుదము.

ధర్మ:—ఈరాత్రి యిందే గడపి తొలిజామున మేల్కాని కాల్యంబులం దీర్చి ధర్మదేవతాపరబలంబున నజ్ఞాతవేషంబు లలనడుం గాన నొక్కొక్కరొక్క తరుణంబున వేఱుమార్గంబులఁ జని విరటుని కొలువునం గుమురవలయు.

భీమ:—ఇది చక్కని యుచితదేశము. ముందు ధర్మదేవతం బ్రార్థింపుఁడు. తదనుజ్ఞఁ బడసి కార్యమునకుఁ గడంగుదము.

ధర్మ:— (ఆచమనంబుచేసి తూర్పుమొగంబై) మహాత్మా తంత్రి.

## 3 పాట.

చ. మునుపు సరోవరంబునడ♦మూర్తిఁ గనంబడనియు కంబరం
బునఁ దగు నీప్రసాదమును♦ బొందియె నల్వురఁ బ్రాణవంతులం
గనుఁగొనఁ జాలినాఁడ నిదె♦ కాలము క్రమ్మఱ వచ్చె నప్పు డి
చ్చిన వరముం దలంచి దరిఁ♦ జేర్పుము దీనజనావనాదరా. 19

(కొంచెమూరకుండి కన్నులువిప్పి) సోదరులారా! ధర్మదేవత నామనంబునం దోఁచి రేపు మీయిష్టంబులం దీర్చువాఁడ. కష్టములు తొలఁగునట్లు చేసెద. సుఖసంపదలు మిమ్ముఁ బొందఁ గలవని పల్కెను.

భీమ:—తరువాత, తరువాత?

ధర్మ:—1మాయొల్లరసుఖము మీయధీనమే యని మనవిచేసితి.

భీమ:—ధర్మదేవత యనుగ్రహము మనపైఁ గలదనుట స్పష్టమాయెు. ఇఁక భయమేమి?

ధర్మ—2ధర్మదేవత యనుగ్రహమునఁ గృతకృత్యుల మగుదుమని సంతోషంబును, దుస్తరవ్రతారంభము రేపువూనవలయునను దుఃఖమును మనస్సున నొకదాని మించి యొకటి తోఁచుచున్నవి.

భీమాదులు:—3ఈవిషయమును ధౌమ్యమునికిని దక్కుంగల విప్రప్రవరులకుఁ దెలిపి వారియనుజ్ఞఁ బొందుట యిప్పటిపని కదా. వారి యుపదేశములఁ గైకొనుట కూడ ముఖ్యము కదా.

---

1. దేవతాజ్ఞాంగీకారకథనముచే నిది సమాధానము.
2. సుఖదుఃఖహేతోక్తిచే నిది విధానము.
3. రహస్యమును బలువురకుఁ దెలుపుటచే నిది యుద్భేదము.

ధర్మ:—[1]ఇదియిక్కాలి చక్కని పద్ధతి. అట్లు చేయవలసినదే ధౌమ్యాదులం బిల్చి యీవిషయమును దెల్పి వారిదీవనలఁ బొందుఁడు.

భీమ:—మీచిత్తమునకు వచ్చినట్లు బదులు పల్కక చేయుచుందుము. అదియ మా యభివృద్ధికి హేతువు. మేము తెలుపుటకంటె మీరు వారితో ముచ్చటించిన మేలే కా.

ధర్మ:—[2]వత్సలారా! అట్లే చేసెదను. బ్రాహ్మణాశీర్వాదములఁ బొందుట పురోవృద్ధికి హేతువు గాన నప్పనికిం బూనెద. సాయంసమయ మగుచున్నది. ఇందీరాత్రి గడపుదము విరటునగరంబు కొంతదూరముననే కలదని తెలియవచ్చెఁ గదా. ఈస్థలము వాసయోగ్యముగ నున్నది. శీతలజలము లిందుఁ బ్రవహించుచున్నవి గ్రామము లిచెంత లేనందునఁ గొన్నిచిక్కులు మనకు రాఁజాలవు. మీరును గడు బడలియున్నవారు. పాంచాలి యందఱికంటె శ్రమ చెందినది. ఇంకను ముందు నడచుట కర్జంబు గాదు. నేనిప్పుడ మునీంద్రులకుం దెలిపి వారియుపదేశములం బొందఁబోయెదను.

(ఇదిముఖసంధి)

ఒకవిప్రుఁడు.—

శా. దుష్టాత్ముల్ కపటక్రియాభిరతులై ♦ దోర్దర్పన కల్పించు నా
కష్టంబుల్ మదినోర్చి రింతదనుకం♦గాలం బిదల్లై శ్రమో
త్కృష్టంబై తగుఁ జూడఁ జాల ననుచున్ ♦ దీప్తుల్ తొలంగంగ న
స్పష్టాకారముఁ దాల్చి పొందెద రవి ము♦ స్తత్క్షోణి భృత్పార్శ్వముల్. 20

భీమ:—అగ్రజా! ప్రతిక్షణము మీయాజ్ఞనే తలంచుచు నట్టే మెలంగెదము.

ధర్మ:—ధర్మదేవతం బ్రార్థించుచు నేమఱక మెలంగుచుండవలయు. నేను నింక నభిమతకార్యము నొనరింపఁ బోయెద.

(అని యందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము,

---

1. బీజమునకుఁ దగురీతిఁ బ్రోత్సహించుటచే నిది భేదము.
2. బీజానుకూలప్రకృతకార్యము నారంభించుటచే నిది కరణము.
బీజారంభసంబంధ రూపముఖ సంధి ముఖ్యాంగసహితంబుగఁ జెప్పఁబడినది,

# ద్వితీయాంకము.

---

(వృద్ధబ్రాహ్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వృద్ధ:—[1](తెరలో విచారముతో) చాలకాలమునుండి సంతోషముగఁ గాలము గడపుచుండిన నేను ముదుసలితనమున, పాండవుల కష్టములఁ జూచుటకే జీవించియున్నాను. అక్కటా! కాలమహిమము! సకలయాచకకల్పతరువులయి ధర్మతత్పరులై, నిర్మలమనీషులగు పాండుపుత్త్రులకే సకలకష్టములు సంభవించినవి.

గీ. ధర్మరక్షకు లెవరో యు◆దారచిత్తు
[2]లెవరో యుపకారతత్పరు ◆ లెవరో యట్టి
సాధుకౌంతేయులకుఁ జాల ◆ సమ్మదంబుఁ
జివరకుం గూర్పఁ గానెంచె◆దువిధిఁగోర । 1

(ప్రవేశించి చూడ్కి నిగుడించి) అదివచ్చువాఁడు ధర్మనందనుకడ నుండు వర్ధమానుఁడని దోఁచుచున్నది.

వర్ధ:—(ప్రవేశించి) ఆర్యోత్తమా నమస్కారము.

వృద్ధ:—వర్ధమానా! వర్ధిల్లుము. వర్ధిల్లుము. ధర్మనందనుం డనుజన్ములతోడ నెటకో పోవుటకుం బయనమై యీయరణ్యమునకు వచ్చియున్నాఁడట. నిజమేనా?

వర్ధ:—నిశ్చయమే కాని సకలపరివారపరివృతుండై మెలఁగుచుండిన కౌంతేయాగ్రజుండు దుస్తరమగు నీవత్సర మజ్ఞాతచర్య నెట్లు గాలము గడపునో.

వృద్ధ:—[3]బుద్ధిమదగ్రగణ్యా! అట్లుసంశయింపఁ బనిలేదు. కౌంతేయులచరిత్ర మసమానము. సామాన్యదృష్టికిం గోచరించునది కాదు. వారికి దుష్కరమైన దేదియు నుండనే యుండదు. వారు లోకరక్షణార్థ మవతరించిన మహాపురుషులు.

---

1. సాయంకాలవర్ణనముచేఁ బ్రతిహతమగు కథాభాగమును మరలఁ జెప్పుటచే నిది బిందువు.

2. విధికిఁ గౌంతేయులయందలి ప్రీతిని సూచించుటచే నిది విలాసము.

3. దృష్టనష్టబీజానుసర్పణరూపమగుట నిది పరిసర్పము. లక్ష్యమగు యాత్రయు, నలక్ష్యమగు కథాబీజమును మరలఁ బ్రకటించుటచే నిటఁ బ్రతిముఖసంధి వర్ణిత మయ్యె.

భగవంతుఁడు వారికిం దోడునీడగ నుండును. వారి నెదిరింప వంచింప దేవదానవులకైన శక్యముకాదన నింక మానవులమాట చెప్పనేల?

వర్ధ:— స్వామీ మీరన్నమాట బాగున్నది. కాని కాఁగలకార్య మెట్లు పరిణమింపఁగలదో యెవరెఱుఁగుదురు.

వృద్ధ:— ఆసంశయమే వలదు. వారి కనుకూలశుభము లభించును. భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు వారికిఁ దోడునీడవలె నున్నాఁడు కదా.

వర్ధ:— నిశ్చయమే. శ్రీకృష్ణసహాయము కలదనియే మనమూహింపవచ్చును.

వృద్ధ:— ఇపుడు కౌంతేయు లెచ్చటనున్నారు. నేనచటికిం బోవఁ దలఁచి యున్నాఁడను.

వర్ధ:— ఈప్రాంత్యములనే మహారణ్యమధ్య మసరోవరముకడ మఱ్ఱిచెట్టు నీడన నిన్న యుండిరఁట. నేనును వారిని దర్శింపఁబోవవలయు. స్థలము తెలియనుగాన వెదకుచుఁ బోవఁజను. ఇంక నాకనుమతి నిండు.

వృద్ధ:— నేనుగూడ నింకొకత్రోవ వెదకుచుఁ బోయెద.

(ఇరువురు నిష్క్రమింతురు)

(ఇది చూళిక)

(తరువాత సోదరులతో గురువృద్ధులతో ధర్మరాజు ప్రవేశించుచున్నాఁడు.)

ధర్మ:— సోదరులారా! ఇంతదనుక మనమందఱ మొకచోటనుండి కష్టముల ననుభ[1]వించినను సుఖముగ నున్నట్లే కాలముగడపితిమి. ఇఁక నొక్కొక్కరే కాలముపుచ్చుచు ప్రతిభంగము గాకుండ వర్తింపవలయు, ఇన్నిటికిఁ గారణము రాజ్యకాంక్షయే కదా. కాఁబట్టి నాకిన్నియుఁ దలంపునకు వచ్చుటచే రాజ్యకాంక్షయే తొలఁగుచున్నది.

## ౪ పాటు.

భీమాదులు:— కౌంతేయాగ్రజా! ఇట్లు మీరు నిరుత్సాహ మూనుట ధర్మంబుగాదు. పండ్రెండుసంవత్సరములు సకలకష్టములకు లోనై గడపితిమి. ఇఁకఁ బండ్రెండునెలలు శ్రమించిన నవ్వల వైరిమారణరూపమగు విజయలక్ష్మిని బొందఁగలము. అదియే రాజకృత్యము, కావున మొదట మనమనుకొనిన మాటను దాఁటరాదు.

ధర్మ:— [2] (కొంచెము యోజించి) నిశ్చయమే. మీకిది యిష్టముగ నున్నది కాన నేనును దప్పక యట్లే ప్రవర్తింప సిద్ధముగా నున్నాను.

---

1 విషయములయం దిచ్ఛలేమిని దెల్పుటచే నిది విధూతము.

2 విషయేచ్ఛా నివృత్తిని వదలుటను దెల్పుట నిది శమము.

భీమ:— ప్రతిజ్ఞాచరణప్రమోదము మీకు స్వభావమే కాని క్రొత్తదికాదు.

ధౌమ్య:— [1]కష్టముల ననుభవించిన పిదప ముదుసలితనముననైనను రాజ్యలక్ష్మిని మీరు పొందియుండఁ జూడవలయునని మీకెమ్ముల కోరిక.

ధర్మ:— [2](చిఱునవ్వు మోమునఁ దోఁప నందఱినిఁ జూచుచున్నాఁడు)

ధౌమ్య:— మీరు భగవదంశసంభూతు లగుటయు, భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తి మీయెడఁ బ్రసన్నుఁడై యుండుటయు జయసూచకములు గదా. ఏకాంతము లేక కార్యము కొనసాగఁ గలదు

ధర్మ:— తమయాశీర్వచనమే సకలసంపత్సమృద్ధికి మూలము.

ధౌమ్య:— ఇఁకఁ దడవు సేయరాదు. వ్రతాచరణమునకుఁ గడంగవలయును. శత్రువులు మాయోపాయములు పన్నుచును వేఁగులవారు తిరుగుచుందురేమో. నేఁటి నుండియే మీయజ్ఞాతచర్య ప్రారంభము కదా.

ధర్మ:— నిశ్చయము. నేఁటినుండియే పగవారు మమ్ము వెదకఁ బ్రయత్నింతురు.

ధౌమ్య:— లోకమున నెందఱికో విరోధులు గలరు గాని మీవిరోధులంత దుష్ప్రవర్తకులు గనఁబడరు. దైవ మెప్పుడు వారి నడంపఁ దలంచి యున్నాఁడో.

ధర్మ:— మహాత్మా! వారి ననవేల? మా గ్రహచారమే యీయిడుములకు మూలము.

౫ ప్రాటు.

ద్రౌపది:— ఈశాంతమే యిడుములకు మూలము. లేకున్న నాఁడు నన్ను నవమానించినప్పుడే కాలదండోద్దండ భీమగదాదండము చేతను, కిరీటిగాండీవనిర్ముక్త శాతశరవ్రాతముల చేతను వారు పడకయుందురా.

ధర్మ:— [3](చిఱునవ్వుతో) సాధ్వీమణీ! నీ యన్నమాట యసంగతి మనఁజాలను. కాని కాలము ననుసరించి ప్రవర్తింపవలయుఁ గదా. అది బలవత్తరము. దానికి సకలబ్రహ్మాండములు లోఁబడి యుండును మన మెంతవారము. నీకోరిక వైరివారణనిబద్ధమైనది. అట్లగుటయు యుక్తమే. శ్రమములకు లోఁబడి యీసంవత్సర మెట్లో గడపినఁ దర్వాత నీవాంఛితము నెఱవేఱును. సంశయింపకుము. అప్పుడే చేయుటకన్న నాపని నీకనుగ్రహము చేయఁ బూనుటచే నీకనంతానందము గలుగఁ గలదు. దానిని తృప్తిమీఱ ననుభవింతువులే. త్వరపడక యీ దుష్కరవ్రతము నేర్పున నెఱవేర్పవలయు

---

1 పరిహాసవచనరూపమగుట నిది నర్మము.

2 నర్మలబ్ధధృతిరూపమగుట నిది నర్మద్యుతి.

3 ప్రత్యక్షనిష్ఠురవచనరూపమగుట నిది వజ్రము. [పన్యాసము.

4 అనురాగహేతూపాయముతోఁ గూడిన వాక్యరచన యగుట నిది ఉ

ద్రౌప:—1ఇట్టి శమదమాదులు మీకు నైజగుణములగుటచేత నీ యజాతశత్రు వనునామధేయము జగద్విఖ్యాతమై నెగడినది. మీయనుగ్రహముచే నాకట్టి యపరిమితానందము ముందు కలుగునుగాక. ఈదుస్తరసంవత్సర వ్రతము సులభముగఁ దీర్పఁగలము. ఏలన మీమనస్సున నిట్టి యుత్సాహము కలుగుటయే మనభవిష్యచ్ఛుభములకు హేతువని నమ్ముచున్నాను.

ధర్మ:—సాధ్వీమణీ ప్రతివిషయమున జ్ఞాపక ముంచుకొనఁదగిన విషయముల నిన్నే మందలించితిని. జాగ్రత్తగఁ బ్రవర్తిల్లుము.

ధౌమ్యు:—రాజపుత్రా! ఇఁక మీరుచేయఁబూనుపనిని నెఱవేర్పవలయును. చుట్టుపట్ల నెందఱో మనుష్యులు కనఁబడుచున్నారు. వారెవ్వరోయను సందియము నాకుఁ గలదు. మనమందఱ మొకచో నుండరాదు. నేఁజెప్పఁదగినవాక్యముల వినుండు.

సీ. రాజుచిత్తము భీకరంబు వ్యాఘ్రంబట్లు
గావున మెలఁకువ గనఁగ వలయు
నర్హస్థలంబున యందుఁ గూర్చుండగాఁ
జను న్యాయమే యైన మనుజపతికి
సహాయంబుగా నున్న వస్త్రానిఁ బల్కక
యుండనే నాఁడిగి కూర్చుండవలయు
సూదోక్తులకు హితా వెుప్పఁగాఁ బలుకంగ
వలయు రాజోక్తుల వెలికిఁ దెలుప

తే. రాదు, సభలందు రాణుల మాటలు
తెలిసియున్న నవియుఁ దెలియనట్లు
లుండవలయు నింక కొప్పని పల్కును
బలుకకుండవలయుఁ బార్థివేంద్ర. 2

(అని మఱియు నేవో కొన్నిమాటలు చెప్పును)

ధర్మరాజాదులు:—మహాత్మా మీయుపదేశమును జక్కఁగా గ్రహించితిమి. కృతమెఱిఁగితిమి తమయుపదేశానుసారము ప్రవర్తిల్లెదము. ఇఁక నొక సంవత్సరమునకు మిమ్ము దర్శించుభాగ్యము కలుగఁగలదు.

ధౌమ్యు:—మీ కఖిలశుభము లొందునట్లు జపియించుచు నుండెద. మీరిఁకఁ ద్వారపడి పయనము సేయవలయును.

ధర్మ:—తమయానతి నాచరించెదము. ఇదిగో ధర్మదేవతను మరలఁ బ్రార్థించెదను. పరప్రభావమున మావాంఛకుఁ దగిన రూపము లొందుదుము. తమకెచ్చటనో యీసంవత్సరము గడుపవలయును.

1. అనురాగప్రదర్శక ప్రియవాక్యరూప మగుట నిది పున్నము

ధౌమ్య:—ధర్మనందనా, తమరాకఁ గోరుచు నిరంతరము మీకు మేలుచేకూరుటకై భగవంతుం బ్రార్థించుచు, మీయగ్నిహోత్రముల నేమఱక కాచుచుండెదను.

విప్రులు.—రాజచంద్రమా! పండ్రెండుసంవత్సరములు మీతో నడవులలో మెలఁగుచుండిన మాకు నగరవాసమునకంటె వనవాసమే మేలని తోఁచెను. ఇఁక మీ సంగతి వదలి యెందో నగరమందే సంవత్సరముండుము. కాన మాకిది వనవాసముగనే తోఁపక మానదు.

ధర్మ.—మహాత్ములారా! తమయాశీర్వచన ప్రభావమున నీసంవత్సర మెట్లో గడపి వత్తుము. పిమ్మట మీపాదసేవ చేయుభాగ్యము మాకుఁ గలుగున ట్లాశీర్వదింపుఁడు.

విప్రులు:—రాజ్యలక్ష్మి కాటపట్టు కాఁదగిన మీ కీవినయము సహజాలంకారమే కాఁబట్టి,

తే. శత్రువులకుట్ర లెవియు మీసన్నిధికిని
జేరకుండెడుఁ గాత, సంశ్రితకులాళి
హితమహాత్తర ధర్మమే యెల్లవేళ
లందు మిముఁ గాచుఁ గావుత మాదరమున. ౯

ధర్మ:—తమయాశీర్వాదములే మాకు సహాయములు. ఏకొఱంత లేక యీయజ్ఞాత 1వ్రతము జరపి వత్తుము. మరల మిమ్ముదర్శించి సేవించుభాగ్యము మాకుఁ గలుగునని యే నమ్మెదము.

విప్రులు:—నిస్సంశయముగ మీవ్రతము నిర్విఘ్నముగ సాగును. మీకు విజయలక్ష్మి ప్రాప్తించును.

ధర్మ:—(అందఱిని గలయఁజూచి) మహాత్ములారా! సూర్యోదయమైనది. ఇఁక మే మిందుండ రాదు. ఎచటికో వెళ్లెదము. రహస్యరక్షణము చేయవలయు. మిమ్ముం దఱ వేఁడుకొనియెదను. మీయనుమతి నొంది పయనము చేసెదము. ప్రచ్ఛన్నరూపమున మాకుశలముల నరయుదురుఁ గాక. (అని చెవిలో నేమో చెప్పును.)

ధౌమ్యాదులు.—మీకు సకలశుభములు గలుగుఁగాక. మే మిదె పనివినియెదము.

(అనియందఱు నిష్క్రమింతురు.)

2 (ఇది ప్రతిముఖసంధి)

ఇది ద్వితీయాంకము.

---

1 అజ్ఞాతవాసానుగుణ ప్రయత్నము నచిఁ చుటచె నిది ప్రయత్నము. [సరి.

2 ప్రయత్నబిందుసంబంధముచే సముఖ్యాగము గాఁ బ్రతిముఖసంధి చెప్పఁబడి

# తృతీయాంకము.



[1](పిదప మాఱువేషములధరించిన ప్రభాకర విభాకరులను నిద్దఱు బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు.)

ప్రభా.—ఔరా! చూచితివా విభాకరా! దైవచేష్టితము లెంతబలవత్తరములు. సకల సామంతరాజ పరిష్కృతుఁడగు ధర్మనందనుం డిపుడు వేషాంతరమూని యెందో యున్నాఁడఁట. మనమామహనీయ మూర్తిని గనుంగొని సంభాషించు టెట్లు? వారెట్టి కష్టములఁ బొందుచున్నారో.

విభా.— 2 భగవదనుగ్రహము వారికి భేద్యకవచమై యుండఁగా నేవిషయమున లోపముండును.

ప్రభా.—మిత్రమా! నీవన్నమాట నిశ్చయమే. కాని శత్రువులవేఁగులవా రందఱు వెదకుచున్న జాడ లగపడుచున్నవి. ఆవిషయమున నించుక యనుమానము నాకుఁ గలుగుచున్నది.

విభా.—సంశయింపఁ బనిలేదు. కంటికి ఱెప్పచందమున శ్రీకృష్ణమూర్తి వారికిఁ బ్రాపైయుండ దుర్యోధను దుర్మంత్రము వారి నేమిచేయఁ గలదు!

ప్రభా.—నీవచనభంగి మిక్కిలి యుక్తియుక్తముగ నున్నదనుటకు సంశయమే లేదు. అయినను భవిష్యత్ఫలము లిట్టివని మనము నిశ్చయింపఁ గాని యూహింపఁ గాని చాలము.

విభా.—నాకీవిషయమున నిసుమంతయు సందియము తోఁపకున్నది. మనము పాండవపక్షపాతులమని యెవ్వరెఱుఁగఁ జాలరు. ఈవేషములు మనగుట్టును బయలు పఱచునవి కావు. వలసిన తావులఁ దిరుగవచ్చును. విషయములఁ గనుఁగొనవచ్చును. ధర్మనందనుఁ డాజ్ఞాపించినట్లు శత్రుదుస్తంత్రములఁ బరీక్షింపవచ్చును.

---

1 పూర్వాంకమందు నిర్దేశింపఁ బడిన పాత్రముల కిందుఁ బ్రవేశము కల్గించుటచే నిది యంకాస్యము.

2 దైవానుగ్రహరూపబీజమున్ను వరల సాకర్షించుటచే గర్భసంధి యారంభింపఁ బడియె.

ప్ర భా.—[1]వయస్యా! అసమానబుద్ధిప్రభావమున బృహస్పతిని మించితివి. నీవచనభంగి నాకే యెంతో యద్భుతమును గల్గించుచున్నదే. మనమిప్పుడు చేయందగిన దేది? శత్రుదూతల పన్నగములం బరీక్షించుటయే కదా.

విభా:—అంతమాత్రమే కాదు. హస్తినాపురంబున కరిగి యచటి ప్రయత్నములం గూడం గనుంగొని ధౌమ్యమునీశ్వరులకు విన్నవింతము.

ప్ర భా.—[2]నిశ్చయముగా దుర్యోధనుం డిప్పుడు కౌంతేయుల జాడలరయ ప్రయత్నములను జేయుచుండును గదా.

విభా.—[3]అందులకు సంశయమా, ఆదురాత్ముండు కొంతకాలమునకు ముందే ఆయాదేశములలోని నీతిగతుల నారయుచుండం గొందఱ నియోగించియే యున్నాండని మనము వినియుంటిమి. క్రొత్తవారి జాడలు కనిపెట్టుట దానసుకరము కదా. కాంబట్టి యెన్నియో ప్రయత్నములు జరపంబడుచుండును. జరపంబడియే యుండును. జరపం బడంగలవు.

ప్ర భా—ఇన్ని ప్రయత్నములలో నేదయిన నొకటి ఫలించనా కౌంతేయుల గతి యేమగునో.

విభా—ఫలించినచో నేమైన నగును. ఫలించుట గగనకుసుమము కదా.

ప్ర భా.—ఫలించదనియే నా నమ్మకము.

విభా.—సత్యముగా నాకట్టి నమ్మకము గలదు. దైవబలసంవర్ధితులగు మాన్యులకు వైరి దుస్తంత్రములు ఫలము నీయంజాలవు.

ప్ర భా.—[4]సంతోషము సంతోషము. మిత్రమా! నీవాక్యము ఫలించుంగాక. ఎట్టి సంతోషము నీ చల్లని వచనము విననోచితిని నాసంశయములు తొలంగినవి. మన మిపు డేమిచేయు టవశ్యము?

విభా.—త్వరగాం బయనమై హాస్తినాపురం జేరి యచ్చట వారు చేసియున్నట్టియుం, జేయుచున్నట్టియుం, జేయంబోవం బూనినట్టియుం బ్రయత్నముల నరయుట మనకుం గర్తవ్యము. కాంబట్టి త్వరగా వెళ్లుదము రా.

(అని నిష్క్రమింతురు)

---

1. ప్రకృతోపయోగియగు కార్యాచరణము దెలిపినది యభూతాహరణము.
2. వితర్కవద్వాక్యమగుట నిది రూపము.
3. తత్త్వార్థకీర్తనమగుట నిది మార్గము.
4. ఉత్కర్షవాక్యరూపమగుట నిది యుదాహరణము.

(పిదప హాస్తినాపురమునఁ గొలువుకూటమున యథోద్దిష్టముగా సపరివారుఁడై దుర్యోధనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

## ౬ పాట.

దుర్యో.—(శకుని దుశ్శాసనకర్ణులం జూచి) మనమీనడుమ దేశాంతరములకుఁ బంపియున్న వేఁగులవాండ్రు వచ్చినారా. మీరావిషయమై యేమి పరిశ్రమము సలిపితిరి?

శకుని.—రాజా! ఎన్నియో విధములఁ బ్రయత్నములు సల్పితిని. వేఁగులవారి కెన్నెన్నియో యుక్తులను దెల్పి పంపితిని. వారిజాడ లింకను గానరాలేదు. ఇంకఁ గ్రొత్తగాఁ జేయఁదగిన ప్రయత్న మేదియు నాకుఁ దోఁపలేదు.

కర్ణుఁడు.—చేసిన ప్రయత్నము లేరీతి ఫలించునో ముందు తెలిసికొని యవ్వల నేమి ప్రయత్నము చేయఁదగునో పరికింతము.

దుశ్శాసనుఁడు.—వ్యవధిచాలినంత యిఁక యుండున్నట్లులేదు. కావున నతిత్వరితముగఁ జేయఁబూనిన ప్రయత్నములఁ జేయుదము. అమీఁద దైవము పంచినట్లయ్యెడు.

శకుని:—పాండవులు ప్రాణములతో నుందురా యని సంశయించుచున్నాఁడను. ఈపాటి వారియెముకలు గూడ నరిగిబోయి యుండునేమో. ఎందుండినను బరికించి తేఁగల చారులు పోయియున్నారు. రేపో మాపో రావచ్చును. వారు వచ్చిన పిదపఁ జేయఁగల పనిని జేయుదము.

(ద్వారపాలకుఁడు ప్రవేశించుచున్నాఁడు).

ద్వార:—జయము జయము మహాప్రభువు వారికి.

దుశ్శాస:—ఏమి వార్తలు.

ద్వార:—వేఁగులవా రందఱు సుమతి పురస్సరులై ద్వారమునఁ గాచియున్నారు. ఏమి సెలవు?

దుశ్శా:—(రాజానుమతినొంది) త్వరగా వారిని బంపుము.

ద్వార:—చిత్తము (అని నిష్క్రమించును).

(సుమతి మొదలగు వేఁగులవారు ప్రవేశింతురు).

వేఁగులు:—జయము జయము మహారాజు గారికి.

దుర్యో:—(త్వరతో) మీరరిగినపని యేమైనది? ఖండించుకొని వచ్చితిరా.

సుమతి:—(వేఁగులవారి యనుమతినొంది) మహాత్మా! ఆనాఁడు తిమయానతి తలఁదాల్చి విచ్చలవిడి మాయావేషములం దాల్చి సంకేతముగీతి నందఱముఁ బోతిమి. మహీధరములు, కాననములు, నదులు, భూవివరములు, గుల్మములు, బావులు, చెఱువులు, గరుసులు ఇఁక నవియివియని చెప్పనేల గొప్పచెట్లతొఱ్ఱలు గూడఁ

బరిశీలించితిమి ప్రతిమంగళవారము సంకేతస్థలమునఁ గూడుకొంటిమి. ఎందుఁ గాని వారిమాటలుగాని వారిజాడలుగాని కానరావు. పల్లియలలోఁ గూడ వారినిఁ జెప్పుకొనువారు కానరారు

దుర్యో:—ఇపుడు నీతాత్పర్య మేమి?

కుమతి:—నామిత్రుల తాత్పర్యము మాత్రము పాండవులీలోకమును వదలిరనియే.

దుర్యో:—నీ తాత్పర్యమో.

కుమతి:—మహాప్రభూ! రాష్ట్రములెల్లం గ్రుమ్మరితిమి కాని మత్స్య, సాళ్వ, విదేహ, బాహ్లీక, దశార్ణ, శూరసేన, కళింగ, మగధ, దేశంబులు మాత్రము పరిశీలింప మైతిమి. రోగబాధలు గనక సకలసస్యసమృద్ధి నొంది యీదేశము లనవరతసంతోషాంబుధి నోలలాడు ప్రజలచే నిండియుండునవి యని విన్నవాఁడ. కాఁబట్టి యాదేశముల వెదకిన దొరకకుందురా యని నమ్మియున్నవాఁడ. ఒకటి రెండు నెలలు గడువొసంగి మఱికొందఱఁ దోడిచ్చినఁ గార్యము పండించుకొని రాఁజాలుదు. ఆపై దేవర చిత్తము

దుర్యో:—మఱికొందఱ ననఁగా నెవ్వరెవ్వరిని దోడీవలయును?

కుమతి:—కపటనాటకసూత్రధారుఁడని వన్నెతింగిరయే యెఱుందురు. ఐనను దేశాంతరములఁ బోయి చోరకానితావులఁ జొచ్చునేర్పు నాకుఁ జాలినంత లేదు. కాఁబట్టి మనయులంబసుని కుమారుఁడు వజ్రరోముఁడు వానిపరిజనులు నాకు బాసటలైయున్నచో నాశక్తిఁ జూపి దేవర మెప్పు వడయుదు.

దుర్యో:—దుశ్శాసనా త్వరగా వజ్రరోముని బిలపించి కుమతిని పంపుము. కుమతీ! ఎంతవేగముగా ఈశుభవార్త మాకు విన్నవింతువో చూచెదఁ గాక.

కుమతి:—చిత్తము చిత్తము రాజేంద్రా! నాకడిమి మెఱసి ముజ్జగంబుల గడగడ వడఁకింపఁ జాలుదు. ఇపుడేల నాపంతములు, వెనుక యేలినవారే చూచి యానందింపఁ గలరు

శకుని:—రాజచూడామణీ! మనము రహస్యమండపమున నిశ్చయింపవలసిన విషయములు పెక్కులున్నవి. ఇప్పుడే వానిని నెఱవేర్పవలయును. కావున మన మచ్చటికిం బోవలయును.

(అందఱు నిష్క్రమింతురు.)

---

(విరాటమహీపతి సకలపరివారముతోఁ గొలువుకూటము ప్రవేశించుచున్నాఁడు.)

విరా:—ఉత్తరకుమారా! కొలఁదిదినముల క్రిందట బృహన్నలయను పేడి మనయొద్దఁ గొలువుసేయ వచ్చెఁగదా. నర్తనశాలయం దతనికి నుద్యోగ మిప్పించితిమి.

కుమారీమణికిఁ జక్కఁగాఁ బాఠము జరుగుచున్నదా. ఎప్పుడైన నీవచటికిఁ బోవుచుందువా.

ఉత్త:—చిత్తము తండ్రిగారూ! పెక్కుపర్యాయము లక్కడకుం బోయియుంటిని. చక్కఁగాఁ బాఠములు జరుగుచున్నవి. బృహన్నల యక్కలకుఁ జదివించుచు నాటియందు మిగుల జమత్కృతి గల్గునట్లు నేర్పుచున్నాఁడు.

విరా:—వత్సా! ఆనాఁడు తొలుదొలుత నేనాతని జూచినప్పుడే యెవ్వాఁడో మహాపురుషుఁడుగా నుండనోపునని నాకు స్ఫురించినది. చూడ రెండుకన్నులు చాలకపోయినవి. ఆభుజముల విశాలత్వము. ఆవక్షస్స్థలౌన్నత్యము, ఆ నేత్రముల సొంపు, ఆమోము కాంతి. ఆమాటల పరిపాటి యివియన్నియు మహాపురుషలక్షణము లాతనికలవడి పరాక్రమము పోతపోసినట్లాతఁడు కనఁబడియె. ఇన్నియుండియు నొక్కపేడిరూప మాతని కింతగొఱంత గల్గించినది కదా. విధిచేష్టితమని తలంచితిని.

ఉత్త:—జనకా, మీరూహించిన ట్లాతఁడు మహావీరుఁడే అలోకసామాన్య సుగుణశాలి, ధనుష్టంకారమున కలవాటుపడిన చేతులగా యని సంశయింపఁ దగిన గుఱుతు లాయనకున్నవి. శాపమున దేవేంద్రుఁడే యిట్లవతరించెనా యని తోఁచెడి.

కంకుభట్టు:—(చిఱునవ్వు నవ్వును).

విరా:—కంకుభట్టూ! మీరేల నవ్వితిరి మీకా బృహన్నలవిషయమేమేని దెలియునా.

కంకు:—మహీపాలకా! ధర్మజుని కొలువుకూటంబున నున్నవాఁడంగాన నిట్టివారిం జూచియున్నవాఁడ. అతని నింత పొగడనేల? నపుంసకు లందఱు నిట్లేయుందురు. మగవాఁడుగ నున్న బాగుండునే యని తోఁపింపఁ జేయుదురు. ఇట్లనుటచే మన బృహన్నల సామాన్యుఁడని నాభావము గాదు. అతనిపాండిత్య మపారమని యానాఁడే నాకుం దోఁచినది. దేవేంద్రుఁడే యిట్లవతరించెనో యని యువరాజన నవ్వితిని. దేవేంద్రుఁడైననేమి పూర్వదుష్కృతిఫల మనుభవింపక తప్పగు గదా.

విరా:—కంకుభట్టూ, నీయన్నమాట నిశ్చయమే కాని బృహన్నలను జూచినప్పుడాతఁడు దేవాంశసంభూతుఁడుగా నోపుననియే తోఁచినది.

కంకు:—మీయూహ నిశ్చయమనియే నాకును దోఁచుచున్నది కాని యదృష్టహీనుఁడని యతనిం జెప్పవలసి వచ్చినది దేవేంద్రసింహాసనంబున నుండఁ దగినవాఁడే కాని పేడితన మాయదృష్టమును బోఁగొట్టినవి. ఏమిపాప మొనర్చెనో భగవంతుఁడే యెఱుఁగు.

విర:—[1]సంయమీంద్రా! సంతోషము నీవన్నమాటనిశ్చయము. మెచ్చితిని. ఎవ రట్టి పాప మొనర్చి రేఫలము ననుభవింతురో ఎవరెఱుఁగుదురు? మహాత్ములగు మీవంటి సాధువు లెఱుఁగఁగలరు. తమకు బహుమాన మేమే నీయవచ్చును. నిస్పృహులు. ఇవె నావందనములను గానుకగా సమర్పించితిని.

కంకు:—(ఆశీర్వదించి)రాజశేఖరా! సాధుచిత్తముగల మీకిది సహజము. మీవంటి రసజ్ఞులు ప్రభువులందఱైన భూదేవత యెట్లలరారునో.

విరా:—మునీంద్రా! మనవలలుఁడు గూడ బలశాలియే సుమా.

కంకు:—సంశయమేమి? బలశాలియే కాని యుక్తాయుక్తపరిజ్ఞానము తక్కువయని తోఁచెడు. మొన్న మల్లునితోఁ బోరాడునపుడును, సింహమును బట్టి చంపినపుడును అతనిమోటుతనము మనకుఁ దెలియలేదా. తన్నుఁ జూచి యితరు లేమను కొందురో యను జంకాతనికి లేనేలేదు. పౌరుషము నెఱపుటయే యాతనికిఁ బ్రధానము.

విరా:—కంకుభట్టూ! ఏమైన నేమి. అతని మెచ్చుకొనుచుండుము బలవిషయమున నసమానుఁ డగుట స్పష్టమేకదా. వంటచేయుటయందో ఎంతచమత్కారము గలవాఁడు! ఏమిబహుమాన మిచ్చినను వలదనుచుండును. కారణ మేమో.

కంకు:—తిండిపోతుల కాభరణములేలఁ? కడుపునిండ తిండి దొరకినది. హాయిగనిద్రవోవ స్థలము దొరకినది. దిగులా, విచారమా.

విరా:—ఇదేమి కంకుభట్టూ! ఇట్లనుచున్నావు. ఆతని వంటకము రుచింపలేదా ఏమి?

కంకు:—ఆవిషయమునఁ గాదు. నాగరకత తక్కువ యని యంటినే గాని యింకొక దోష మాతనియం దారోపింపఁ బూనలేదు.

విరా:—అశ్వగోరక్షకులు గూడ మిగుల నేర్పఱులు. వారు వచ్చినప్పటినుండి తురగములు సూర్యాశ్వరీతిఁ బ్రకాశించుచున్నవి. గోవులు కామధేనువులఁ దిరస్కరించుచున్నవి. ఈసంవత్సరమున మీవంటి మహనీయులు వచ్చుటచేఁ గాఁబోలు సకలవిధముల నారాజ్యము ప్రాజ్యమై సకలసస్యసంభరితమై, అధివ్యాధులు లేక యలరారుచున్నది.

కంకు:—సర్వథా సర్వదా యిట్లే యుండుఁగాక.

చ. అనిశము సర్వసస్యములు హర్షము నొందుచు భూమి యొప్పఁగా
జనులు స్వకృత్యముల్ నెఱపి సంతస మందుచునుండఁ గామినీ
జనములు భర్తృసేవల నొసల్పుచు హాయిగ నుండ రాజ్యమో
జనవర యేలవయ్య సుఖసంపద లుట్టిపడంగ నెప్పుడున్. 1

1 సామదానోక్తి యగుట నిది సంగ్రహము.

మంత్రులు:— మేలు మేలు. యతిప్రవరుల వాక్యము లమోఘములు. ఫలించియే తీరును.

విరా:— కంకుభట్టూ. ద్యూతము నింద్యమందురు. కారణ మేమో.

కంకు:— ద్యూతమునఁ గుశలత్వమును గాంచిన వారందఱో సకలకష్టముల ననుభవించిరి. నలుఁడు మొదలగువారు రాజ్యముం గోలుపోయి పడరాని యిడుములం బడిరి. దానినుండి రానున్న కష్టములకు మితియే లేదు. సర్వానర్థములకు మూలము.

విరా:— [1]నిశ్చయమే ధర్మనందనుఁడు స్వారాజ్యసామ్రాజ్యమును గోలుపోయి యడవులపాలైనది ద్యూతముననే. ఆవిషయము స్మృతికి వచ్చినా గుండియలు తల్లడిల్లుచున్నవి. వారు మాకుం బరమబంధువులు. వారి శత్రువులను దలంచిన నాకెంతో చింతజనించుచున్నది. ఇంకెన్ని పాట్లు వారికిం గల్పింతురో.

కంకు:— గతజలసేతుబంధ మావార్త. ఇప్పుడు వారిం దలంచి లాభమేమి?

విరా:— ఐనను కంకుభట్టూ వారెందుందురో. వారిజాడ లరసి తెల్పువారెవ్వరైన నుండిన నెంతయో ద్రవ్య మొసంగెద.

కంకు:— విధివశమునకుఁ జిక్కి వారెందో యజ్ఞాతచర్య మీవంటి ప్రభుశిరోమణుల పంచల నుందురు. సమయము వచ్చిన బయలుపడక మానరు. ఆవిచారము మన కిపుడేల? మనము ద్యూతమున నించుక కాలక్షేపము సేయుదము.

విరా:— ఇపుడు పాండవస్మృతిచే నామనస్సు చింతాకులమై యున్నది. ఏమియుఁ దోఁచకున్నది మఱియొక సమయమునఁ బాచిక లాడుదము.

కంకు:— ప్రభువరేణ్యా తమకుఁగల బంధుప్రేమ తేటపడియె. మీమనస్సు నవనీతము వంటిది. కష్టములను సహింపఁజాలదు మీయిష్టానుసారము మఱొక్క సమయమునద్యూతమునఁ గాలక్షేపము సేయుదము.

మంత్రులు:— ప్రభుశిరోమణులతో మనవి చేయఁదగిన కార్యము లెన్నియో గలవు. రహస్యమండపమున దర్శనమిప్పింపఁ బ్రార్థించువారము.

విరా:— అట్లే యగుఁగాక. ఇపుడే పోవుదము.

మంత్రులు:— చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు).

---

(పాకశాలలో సైరంధ్రి యొంటిగాఁ బ్రవేశించుచున్నది.)

సైరంధ్రి:— (తనలో) హావిధీ! ఎంత దయమాలితివి, నాకీయిడుముల రావలయును, సకలభూపాలమౌళిమణిగణఖచితవిస్ఫురత్కిరీటాంకిత పాదారవిందుఁడు,

---

1 శత్రుకృతభీరూఢ మగుట నిది యుద్వేగము.

దుర్వారవైరిగర్వాపహారకుఁడు ధర్మనందనుఁ డిట్టిగతిఁ బొందఁజేసితివి గదా. చండగదాదండమండితదోర్దండభీషణుఁడగు భీముఁ డిట్టివంతలఁ గుందఁజేసితివా, ఇంద్రు నర్ధాసనము నధిష్ఠించి నివాతకవచకాలకేయులం బటురణాంగణంబున నుక్కడించి శివుని మెప్పించి పాశుపతము గైకొని యలరారు నర్జునుని నక్కటా యీగతిఁ బట్టఁ జేసితివి కదా. కందర్పసుందరాకారులు, సుఖ మనుభవింపనే జనించిన నకులసహదేవులను బసులగాపకులనుగాఁ జేసితివి కాదే. ఇంకను నీకు నాపైఁ గరుణలేదా. ముందేమి వంతలఁ గుదియింప నున్న వాఁడవో యూహింపశక్యము గాకున్నది. కాని నీవెన్ని యిడుములఁ గుడుపఁ బంచినను సిద్ధముగ నున్నవారము కిరాతులకైన నూహింపఁ దలంచిన గుండె కరుణార్ద్రము కాకమానునా. దైవమా నీకింకను గరుణ రాలేదా. (స్మృతి నభినయించి) ఏమిది? భర్తలను గూర్చి యిట్లు విచారించుచున్నాను. నాగతి యేమని విచారింపవలసి యున్నది. అంతఃపురమున నింతదనుక నిశ్చింతముగ నుంటి, నన్నెవరు గాని పల్లెత్తుమాట యన్నవారు కారు. సుధేష్ణయు సగౌరవముగాఁ జూచుచుండును [1]చెప్పఁదగని పనులేవియుఁ జెప్పదు. నన్నుఁ దన కన్నకూఁతువలెఁ గాపాడుచుండును. ఎంతెంత సన్మానించుచున్నను నాచిత్తము చింతలఁ జివికిపోవుచున్నది నాస్థితి యిట్లాయెఁ గదా యని యొక్కమాటు స్మృతికిఁ దోఁచెనా కన్నీరు మున్నీరుగాఁ గాఱుచుండును. అట్టిసమయమున నెవరేనిఁ జూచిరా గుట్టు బయల్పడును గదా. ఇట్లుండ గోరుచుట్టుపై రోకలిపో టన్నట్లు దుర్వారదుఃఖ మొకటి సంప్రాప్తము కానున్నది. కీచకుఁడు సుధేష్ణ యంతఃపురమునకు వచ్చినప్పుడెల్ల నన్నే చూచుచుండును. సేవకులకు నన్నుం జూపి యడుగుచున్నట్లు తోఁచుచున్నది. ఇఁక నాగతి యేమి? ఈవిషయమును భీమునకుఁ జెప్పక తప్పదు చెప్పితినా యాతఁ డాగ్రహవ్యగ్రుఁడు కాకపోఁడు. వానిం గాలుని వీటికిఁ బంపక మానఁడు. ఈ విషయమున సమయభంగ మగునేమో. ధర్మరాజు తొలుదొల్తనే నీశీలము గాపాడుకొనుము నివంక మాకేకష్టములు గలుగకుండఁ జేయుమని హెచ్చరించెఁ గదా. ఇప్పు డెట్లు మెలఁగవలయును? ఎట్లు మర్యాదను గాపాడుకొనవలయు. ఊరకుండు టెట్లు? భర్తలకుం జెప్పుటెట్లు. ముందు గోయి వెనుక నూయి యన్నట్లున్నదే. ఏమైనఁ గాని, భీమునకుఁ దెల్పి యాతని యభిమతమురీతి మెలఁగెద. అర్జునునితో నిపుడు చెప్పినను లాభమున్నట్లు నాకుఁ దోఁపకున్నది. (ఆగ్రహముతో) [2]ఈక్షణముపోయి భీమునకుం జెప్పెద. నామనస్సు

1. హేతువలన విషయము నూహించుట నిది యనుమానము.
2. రోషసంభ్రమవచనమగుట నిది తోటకము.

యుండిపోవుచున్నది. చెప్పక యుండదనున్న మాందెట్లు కీచకుఁడు ప్రవర్తించెనో, ఉన్న దున్నట్లు భీమసేనునకుం జెప్పి యతనిభావమును గనుఁగొని యెద. (ముందునకు నాలుగడుగులు నడచి) ఎవరో లోపల మాటలాడినట్లున్నది? (తొంగిచూచి) ఈ అన్నయగారు. భీమసేనుఁడే ఏమో తనలో గొణుగుకొనుచున్నాఁడు. భోజనము తృప్తిగా నేఁడు లేదేమో. మేము ముందు చేసికొన్న [1]సంజ్ఞ ప్రకారము చిటికెలు వేసెద. (అని చిటికెలు వేయుచు గోడచెంత దాఁగి యుండును).

భీము:—(నలువైపులుచూచి తనలో) ఎవరీ చిటికెలు వేసినది? ద్రౌపదియే కావలెను? లేక మఱియొకరీతిగ నెట్లు చేయనేర్తురు? మఱెవరైన మాసంకేత మెఱింగిరో? అట్టైన మాగుట్టు బయటఁ [2]బడునే, ఏమి గతి? (నాలుగడుగులు ముందు నడచి) ఎవరును గనఁబడలేదు? సైరంధ్రి నాచిత్తమును బరీక్షింపఁ గోరియే ఏదియో శుభవార్తఁ దెలిసియో వచ్చియుండును.

(ముందునకునడచి) ఎవరో యామూల నున్నట్లున్నది (దగ్గఱకుఁ బోవును.)

సైరం:—(మాటలాడక యూరక నిలుచుఁ బడియుండును.)

భీము:—(నాలుగుదిక్కులు కలయఁజూచి) సైరంధ్రీ! ఏమి విచారముతో నున్నదానవు. ఇప్పుడు రానేల? ఇఁక నందఱు వచ్చుసమయము వచ్చును గదా. త్వరగా రాకకుం గారణమును జెప్పుమా.

సైరం:—పావనీ! ఏని బాహుబలమును నమ్మి సోదరులు సుఖముగ నింతకాలము ధరణీతలంబున నుండఁగలిగిరో యట్టి నీవు దగ్గఱనుండియు నాకిట్టి యవమానము సంభవించుచున్నది.

## ౭ పాట.

భీము:—(మహాక్రోధముతో) పాంచాలీ! భీముని మొదలఁ బ్రాణములుండఁగ నే నీ యవమానమును బొంగుటయా విలయకాలయముఁడైన నాముందు నిల్వఁగల్గునా? (కొంచెము ఊరకుండి) అన్నగారి యాజ్ఞయయ్యె నేని ముందు నీవు దుఃఖించుచున్నను జూచుచున్నట్లుఁగును గాని లేకున్న.

సైరం:—(మాటకడ్డపడి) అన్నగారి యాజ్ఞ యేవిధమునను లేదు.

భీము:—(పండ్లు పటపట లాడించి) ఆయడ్డు లేకున్న నింక నిన్నవమానింపఁ జూచినవాఁ డెవ్వఁడో చెప్పుమా. తుద ముట్టించెద.

సైరం:—ఆవిషయము చెప్పక తప్పకున్నది. చెప్పుటకు వీలులేకున్నయది.

---

1. అభిసంధియగుట నిది యధిబలము.
2. శంకాత్రాసరూపమగు సంభ్రమము.

భీము:—ఏల యీలీల ననుమానించుచున్న దానవు ?

సైరం:—నా యవమానకారణమును దెల్పితినా నీయుద్దండబాహుబలమును జూపక యూరకుండఁ జాలవు. ఏమైన నితరుల కెఱుకబడెనా ప్రతిభంగమగుటయు మరల బండ్రెండు వత్సరము లరణ్యవాసము మఱియు నజ్ఞాతవాసము చేయుటయుఁ గాగలవు. దానికే భయపడుచున్నాను.

భీము:—బేలా ! అంతమాత్రము వివేకములేని వాఁడ ననుకొంటివా, కాలదేశముల నెఱుంగక యీభీముఁడు విక్రమించునా అసంశయము వదలి వచింపుము

సైరం:—వినఁ జెప్పెద.

చం. అనిలతనూజ సౌధమునఁ యందు సుధేష్ణ యు నన్ను గారవం
బునఁ గనుచుండ సేవనులు ♦ పోఁటినో చేయఁగ వానిఁ జేయుచుం
మనమునఁ గల్గు భీత యుఱు♦మాత్రము పైఁ దెలియుంగ నీకుచ
క్కని వ్రతము నూని యుండుదును ♦ గాని కొఱంతయె లేదు నాయెడన్.

భీము:—ఇట్టి నీకే విషయమున నవమానము సంభవించినది ?

సైరం:—

చం. కలఁ డొకదుష్టమానవుఁ డ♦ఖండభుజాబలశాలి తమ్ముఁడై
వెలయు సుధేష్ణకాతఁ డతి♦వీరుఁడు గావున నేరినైన ని
మ్ముల గణియింపకే తిరుగు ♦ మూర్ఖుఁడు వాఁ డట వచ్చుచుండు న
న్గలయఁగఁ జూచుచుండు దమ♦కంబు గనంబడు నట్టి చూపులన్. 3

భీము:—సైరంధ్రి ! త్వరగాఁ జెప్పఁదగిన విషయముం జెప్పుము, వాఁడేమైన నిన్న వమానింపఁ జూచెనా యేమి ?

సైరం:—అవివేకి గావున నన్ను సామాన్యవనితామాత్రనుగాఁ దలంచి యితరులతో నన్నడుగుచు నాతో మాటలాడ నుద్దేశించినట్లు నటింప నేనితనితో నేటిమాటలని కార్యాంతరమిషం బూని యవలఁ బోవుచుఁ గాలము గడపుచున్నదాన. అతని తలంపులఁ జూడఁగా నన్నుఁ బలుకరింపక మానఁడని తోఁచుచున్నది.

భీము:—సైరంధ్రి ! యింతమాత్రమునకే యులికి పడెదవేల? క్రొత్తగా నిచటఁ బడిన నాతఁ డెవ్వరోయని తెలియంగఁ గోరి యట్లడిగియుండఁ గూడదా సుధేష్ణ పవిత్రచిత్తయని వింటిమి కదా. ఆమె యింట ననుచితంబుగ మాటలాడుట కెవ్వనికి గుండెగలదు.

సైరం:—నామనస్సు కనుఁగొనుటు కిట్లాడుచున్నావా యేమి ? అతని పద్ధతిఁ జూడఁ

గా దుర్వృత్తితో మాటలాడ వచ్చుచున్న ట్లూహించితిని. లేకున్న నేనేల యావిషయము మందలింతును?

భీము:—ఊహాలపై నూహాలే గాని యాతని నోటినుండి యొక పల్లెత్తుమాటయైన రాలే దుగదా.

సైరం:—వాఁడేమేని మాటాడకున్నప్పుడే మెలఁకువ పడవలయునని నాభావము.

భీము:—ఊహాలపై నూహాలే గాని యాతని నోటినుండి యొక పల్లెత్తుమాటయైన రాలేదుగదా.

సైరం:—వాఁడేమేని మాటాడకున్నప్పుడే మెలఁకువ పడవలయునని నాభావము.

భీము:—ఇప్పటి కీమాటలు చాలు రేపేమేని వాఁడు నిన్నుఁ బలుకరించెనా తగిన ట్లుత్తరమిమ్ము. దుర్వృత్తి గనఁబడు మాటలాడెనా తత్కాలోచితములగు మాటలాడి యప్పటికిని వానినిత్తృప్తి యథాపూర్వముగ నుండనేని రహస్యముగ నాతో నుందలింపుము. విను మావలిమాట.

మ. వసి తారత్నమవై సతీతిలకమై ♦ ప్రఖ్యాతినిం గాంచి మిం
చిన కీర్తిం జెలువారు నిన్ను మదిలోఁ ♦ జింతింప కేతెంచి తు
చ్ఛుని కందంబునఁ గీచకుండు కుసుమా ♦ స్త్రం బుద్ధతిన్నొంచ నో
ప్పని పల్కుల్ వచియించెనేని మృతిఁ గూ ♦ ర్పం జాలుదుఁ నమ్ముమీ.
మఱొక్క మాట వినుము.

తే. సాధ్వి నీరూపమే యుండు ♦ జ్వలనుకుండ
ముగను; నే సోమయాజిగ ♦ మూర్ఖు కీచ,
కుండు మేషంబుగా సము ♦ ద్ధండగదయె
యధ్వరుండుగ సాగును ♦ యజ్ఞ మొండు. 5

ఈపల్కు నిశ్చయమని నమ్ముము. పాంచాలీ! త్రి శుద్ధిగా నమ్ముము.

సైరం:—వాయుతనూజా! నీ వంతవాఁడవని యెఱింగియే నీకడకు వచ్చి చెప్పుకొను చున్నదానను. కాని రేపు వాఁడేమేని వచియింపరాని మాటలు పల్కినా ఆవిషయ మంతయును నీకుం దెల్పి నీయనుమతి యట్లుచేసెద.

భీము:—ఇఁకఁ దడవు సేయరాదు. పరిచారకులు వత్తురు, మసలక పొమ్ము.

సైరం:—మహాబలనందనా! ఇక్కార్యంబును సాధించి నియ[1]మపరిసమాప్తి కాఁగా

1. గర్భబీజోద్భేదనరూపముగల నిది యాక్షేపము.
ఇందే ప్రాప్త్యాశయుఁ బతాకయుఁ జెప్పఁబడినవి.

శత్రువిధ్వంసమొనరించి యుధిష్ఠిరుఁ బట్టభద్రుఁ జేయుటకు నీభుజాబలమునకు భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు తోడగుఁ గాక.

భీమ:—పాంచాలీ! ఇఁక మసలవలదు. జాగరూకవై ప్రవర్తిల్లుము. అగ్రహంబునఁ దోఁచినప్పుడు రావలదు. ఒంటిగా నేనుండుసమయ మారసిరమ్ము.

సైరం:—సకలవిధముల నాలోపము లేకుండఁ బ్రవర్తిల్లుదాన. ఇఁక నంతఃపురమునకుఁ బోయెద.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

(ఇది గర్భసంధి)

ఇది తృతీయాంకము.

---

1. ఇదే ప్రస్తావాపతాకానుసారముగఁ బ్రధానాంగ సంయుతముగ గర్భసంధి వర్ణితము.

# చతుర్థాంకము.



(చండికయను చేటి ప్రవేశించుచున్నది.)

చండిక:—(ఆత్మగతము) ఇంతకాలమునుండి యీయిల్లు కనిపెట్టుకొని యున్నాను. ఎన్నఁడుగాని యొక్కనాఁడైనను జేయరాని పని చేసిగాని, ఇతరులు చేయఁగాఁ జూచిగాని యెఱుఁగను. క్రొత్తవారెందఱో వచ్చుచుందురు. పోవుచుందురు. మరియాదగా నర్తించిరి. నేఁటికిఁ గ్రొత్తదాని వచ్చి యిల్లు చేరిన నాఁటిగా నెన్నియో కష్టములు కలుగుచున్నవి. అమ్మగారి కపకీర్తి కలుగునట్లున్నది ఈ దానిని, నావలె నూరకుండునది కాదు. తన నేర్పంతయుఁ జూపుచుండును. అందులో అందగత్తియు. దీనిఁ జూచినప్పటినుండియుఁ గీచకుఁడు నన్నడుగుచుండును. ఏమో చెప్పుచుంటిని. మూఁడు దినములనుండి యదేమో కాని నన్నుఁ గ్రుచ్చి గ్రుచ్చి యీదాని విషయ మడుగుచున్నాఁడు. అమ్మగా రెఱింగిరా నామర్యాద దక్కునా ఏమిచేయుదు (ముంగుచూచి) అదిగో కీరవాణి వచ్చుచున్నది. (అని వడివడి నరుగుచున్నది.)

కీరవాణి:—(ప్రవేశించి) ఓహో చండికయా, ఎందుల కేమోవిచారించుదానివలె నిందు నిలువఁబడి యున్నావు.

చండి:—ఓసీకీరవాణి, నీకంటె నాకు ఎక్కువవారు లేరుకదా. ఒక్కమాట అడిగెద. చెప్పెదనని చేతిలోఁ జేయిపెట్టుము.

కీర:—ఒట్టు పెట్టుకొనవలయునా, నామనస్సు నీకుఁ దెలియదా అయిన నిదిగో చేతిలోఁ జేయియుంచెద. (అని ప్రమాణము చేయుచున్నది.)

చండి:—(చెవిలో నేమో చెప్పుచున్నది')

కీర:—చండికా, ఈభాగ్యమునకా యింతరహస్యము, నిశ్చయమే, కీచకున కాదా నీపై మోహము కల్గినది. చిత్రమేమి యున్నది?

చండి:—నన్ను దినదిన మడుగుచున్నాఁడు. ఆమెసంగతి నాకుఁ దెలియదని తప్పించుకొనుచున్నాను, ఇఁక దానిగతి యేమి?

కీర:—అక్కా! నీకేల చింత, మనలోఁ బాటు సైరంధ్రి దిక్కులేని దనుకొన్నావా వేమి?

చండి:—ఎవ రామెకు దిక్కు ?

కీర:—కీచకులు నూటుగురైనం జంపంగల గంధర్వులైదుగు రున్నారంట. వారామెను గాపాడుచుందురంట.

చండి:—గంధర్వు లేమి సైరంధ్రిని గాపాడు టేమి ?

కీర:—అక్కా విను. సైరంధ్రి సామాన్యురాలుగాం దలంపకు, దేవతాంశ సంభూతురాలని నాయభిప్రాయము. ఆమెయూహాలు ఆమెమాటలు ఆమెప్రవృత్తి సామాన్యములని తలంచితివా, ఆమెకేమియు దిగులు లేదు. రాణిగారే యామెకు భయపడుచుండును.

చండి:—ఆమాటల కేమిగాని కీచకుఁడు పట్టు పట్టిన యెడల ఎన్నియో చిక్కులు గలుగును. ఈమెకు గ్రహచారము చాలదు. చాలియున్న నిక్కడికేల వచ్చును ఈమెను గీచకుఁ డేల మోహించును ?

కీర:—పాండవులంతటివారలకుఁ జిక్కులు గల్గినవని విన్నారము కదా. ఇఁక నీమెవంటి వారలకు మాత్రము గల్గుట యొకవింతయా.

చండి:—అక్కా! బాగుగా చెప్పితివి గాని పాండవు లేమైనారు ?

కీర:—[1]వారి గడువు దాఁటగనే దుర్యోధనాదుల గర్వమడంచి రాజ్యమును గ్రహించి పాలింతురు. మనము విందుముతే. ఈమెను గీచకుఁ డేమేనిఁ బట్టినా యతనికి మరణము తప్పదని నాకుఁ దోఁచుచున్నది ఇపుడు నీవిట్లాలోచించుచున్నావు. ఇందేల మసలుచున్నావు అమ్మగారు పిలుతురేమో, కీచకుఁ డిపుడు రానున్నాఁడని తెలిసినది. రమ్ము, పోదము.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

(ఇది ప్రవేశకము.)

(సుదేష్ణయుఁ గీచకుఁడును ప్రవేశించుచున్నారు.)

సుధే:—ప్రియసోదరా! కొలఁది దినములనుండి నీమోమున విన్నదనము తోఁచుచున్నది. ఏవిషయమునను గొంతితలేని నీకేల విచారము గలిగినదో తెలియఁజాలకున్నాను. తెలిసినచో నాకు నవకాశముండిన నంతలోఁ దీర్చెదను,

---

1. మైత్రీవశమున నియతాప్తి ప్రదర్శనముఖముగా బీజమును మరల విమర్శించుటచే విమర్శసంధి యారంభింపఁబడినది. చేటీగతదోషప్రఖ్యాపనము వలన నిది యపవాద మనునంగము.

కీచ:—అక్కగారూ! మీరును బావగారును నన్ను సకలవిధములఁ బోషించుచుండ నేవిషయమునఁ గొఱంతయున్నదని చెప్పఁగలను?

సుధే:—నాయనా! ఏల నీమోము వాడియున్నట్లున్నదే. దీనింబట్టి యోచింప నీమనస్సున విడువని చింతయొకటి యున్నట్లు పొడకట్టుచున్నది. దాపనేల? చెప్పరాదా?

కీచ:—(మోమువంచి యూరకుండును.)

సుధే:—నాయనా! ఏమిట్లూరకున్నావు. క్రొత్తవా రిం దెవ్వరును లేరుకదా. నాతోఁ జెప్పఁదగని విచారము నీకుఁ గల్గునని కలలోనైనఁ దలంపకుంటిని. ఈనాఁటి కది సంభవించిన దేమో.

కీచ:—(గద్గదస్వరముతో) అక్కగారూ! చిన్నతనమునుండి నన్నుఁ బెంచి పెద్దచేసిన మీతోఁ జెప్పఁగూడని మాట యొకటి యుండునా, ఐన.

సుధే:—(మాట కడ్డమువచ్చి) సోదరా. ఏల నీకింత వంత గల్గినదో చక్కఁగాఁ జెప్పుమా. ప్రాణములైన నిచ్చి తీర్చెద.

కీచ:—మీరంత ఘోరప్రమాణము చేయ నక్కఱలేదు. మీరు దయయుంచినచో నాకార్యము ప్రయాసము లేకయే నెఱవేఱును.

సుధే:—అట్లైన నింక నింతఁ గుందనేల? దుఃఖింపనేల? మోమున విన్నదనంబును దాపనేల? త్వరగాఁ జెప్పుము.

కీచ:—(మోమెత్తి కన్నీళ్లు గ్రుడుచుకొని) నా ప్రశ్నములకుఁ జక్కఁగా బదులు చెప్పవలయు.

సుధే:—మంచిది తమ్ముఁడా.

## ౨ పాటు

కీచ:—మనయింటనున్న యీసైరంధ్రి యెవ్వతె? దీనిభర్త యెవ్వఁడు? ఎంతకాలమునుండి యిందున్నది? చక్కఁగా నాకుం దెలుపవలయు.

సుధే:—(తనలో) అయ్యో! ఈ దుష్టాత్ముఁడు సైరంధ్రిపైఁ జిత్తము నిలిపినట్లున్నది. ఇఁకేమిగతి? సైరంధ్రిని సామాన్యవనితగఁ దలంచినవాఁడేమో. ఏవురు గంధర్వులు భర్తలు గలరని నాకుఁ జెప్పెనుగదా. దాని ప్రవృత్తినిబట్టి చూడఁగాఁ బతివ్రతాతిలకమని చెప్పక తప్పదు. ఆమెను వీఁడు కోరుట వినాశమునొందుటకే గాని వేఱుగాదు. ఐనను మంచిమాటలతోఁ జెప్పి చూచెద. (ప్రకాశము) నాయనా. సైరంధ్రి యొక పనికత్తియ. దానిమాట నీకేల? నీవడుగఁదగినంత గౌరవము కలది కాదే.

కీచ:—సోదరీమణీ! మీరు చాల పొరపడితిరి. ఆమగువను జక్కఁగాఁ జూచినవా రామె యెవ్వరని యడుగక పోదురా.

సుధే:—నాయనా. పరస్త్రీలసంగతి నీవంటి బుద్ధిమంతు లడుగుట మంచిదికాదు. అందును బరిచారక. దాని జోలి నీకేల? ముందు నీమనశ్చింతకుం గారణమును జెప్పుము.

కీచ:—(తనలో) ఈమె యెఱిఁగియు నెఱుఁగనట్లు నటించుచున్నది. ఐనను దెలుపక వీలులేకున్నది. తెలిపెదఁ గాక. (ప్రకాశము) నామనశ్చింత యాతరుణీమణి విషయమునసే.

సుధే:—(విషాదమభినయించి) తమ్ముఁడూ. ప్రొద్దుపోవని యీమాట లేల? విచార కారణమును జెప్పుము.

కీచ:—సోదరీమణీ! ప్రొద్దుపోవని మాటలని నన్ను వంత గుందించితివా నీకు నీసోద రుఁడు లేఁ డనుకొనవలసివచ్చును. ఇదియే కడపటి మాట.

సుధే:—(ఆత్మగతము) దైవమా. ఇంకేమి చేయుదు. వీఁడు మత్తుఁడు మంచిమాటలకు లొంగకున్నఁ గోపమున నితని లోఁబఱచు కొనఁజాలను బలవంతుఁ డగుట నెవరిని లెక్కపెట్టఁడు. ఇఁక నే నేమి పన్నుగడఁ బన్ని వీనిని మరలింతును. ఐన నిట్లుచెప్పెద (ప్రకాశము) సోదరా. సైరంధ్రిని సామాన్యవనితగఁ దల పోయకుము.

కీచ:—అది సామాన్యస్త్రీగాదనియే నాభావము. కాన నే ప్రశ్నించితి.

సుధే:—ఆమె దేవతాస్త్రీ యనియే చెప్పవచ్చును.

కీచ—దేవతాంగనవంటిది కావునసే యడిగితి.

సుధే:—ఆమె చరిత్రము శ్లాఘ్యము.

కీచ:—శ్లాఘ్యమగుటనే యదెవ్వరని యడిగితి.

సుధే:—అది యని పలుకుట యుచితము గాదు.

కీచ:—కులగోత్రములు తెలిసినంత దనుక దాని నేమనవలయు?

సుధే:—ఆమెను దాసీ యనఁ దగదు.

కీచ:—పరిచారిక యనవలయునా.

సుధే:—కాదు, సైరంధ్రి యనవలయు.

కీచ:—ఏమన్నను సేవకురాండ్రలో నొకతె యగునా కాదా?

సుధే:—ఇతరుల కట్లే తోఁచును గాని నాకామె గౌరవార్హురాలు.

కీచ:—నేనును గౌరవ మునిచియే యాయింతివిషయము నరయఁ గోరితి.

సుధే:—నాయనా విను.

కం. చనుదెంచెఁ గొన్ని నెలలకు
మును పిచటికి దైవయోగ ♦ మున నీతరుణిం
గని పిల్వఁ బంచి నాచెం
తనె యుండు మటంచుఁ గోరఁ ♦ దానిల్చె నిటన్. 1

కీచ:—మీ రట్లు కోరుటకుఁ గారణ మేమో నేను దానిఁ గోరుటకుఁ గూడఁ గారణ మదియే.

సుధే:—ఆమెమోముఁ జూడఁగనే నాకత్యంతప్రేమ ముదయించెను గాన నేనే కోరి యుండుమంటిని.

కీచ:—నాకుం గూడ దానిమోము నిండుచందురునిం దిరస్కరించునట్లు కనఁబడినది. కావుననే మహానురాగమునఁ గోరి యడుగుచున్నాను.

సుధే:—అనురాగమున నన్నియనఁగూడదు

కీచ:—పురుషుఁడనైన నేనట్లే యనవలయు.

## ౬ పాట.

సుధే:—నాయనా! ఇంకఁ గాలహరణమును జేయుమాట లేల గాని యొక్క మాట చెప్పెద. విను, సైరంధ్రికిఁ బతు లేవురు కలరఁట. వారు గంధర్వులఁట. ఆమె కెవరైన నపకారము సేయందలంచిరా వారు ప్రాణములతో నుండరఁట.

కీచ:—ఆమాట లాయింతియే కదా చెప్పెను. పతు లైదుగురా. ఇఁక నాకుఁ బాపమే లేదు. బహుపతులని యూహింపవలయుఁ గదా.

సుధే:—వత్సా! నీ వేమో యనుకొనుచున్నావు. ఆమె భర్తలవిషయమును దలంచుకొంటినా నాగుండెలు తటతట కొట్టుకొనుచుండును.

కీచ:—(మహాక్రోధముతో) అక్కగారూ! నామాట వినుఁడు.

సీ. శత్రువులం గూల్పఁ ♦ జాలు చక్రంబును
హస్తంబునం దాల్చు ♦ హరియెయైన
[1]దుష్టశిక్ష నొనర్చు ♦ తోరపు రౌద్రాస్త్ర
మమరు హస్తము గల ♦ హరుఁడె యైన
నప్రతిహతశక్తి ♦ నలరు బ్రహ్మాస్త్రంబు
ధరియించియున్న వి♦ధాత యైనఁ

---

1. కోపసంభాషణ మగుట నిది సంఘటము.

బర్వతపఙ్క్తముల్ ♦ వ్రక్కలించెడు వజ్ర
మేచి తాల్చిన యమ ♦ రేశుఁ డైన
తే. నేను భీతిని గందునే ♦ మాన కష్టు
వారిఁ గరముల బిగఁబట్టి ♦ భూరిశక్తి
గిరగిరం ద్రిప్పి వైచెద ♦ ధరణిఁ బడఁగ
నితరు లేరైన నీక లెక్క ♦ యే తలంప. 2

సుధే:—ఏత్సా! ఇట్లనుటయే యొకకీడు. మానవులం బోలె దేవతలను దలంచుట న్యాయమా.

కీచ:—దేవీ!

చం. [1]విను మొకమాట యింకఁ బది ♦ వేలమహేంద్రులున్న మార్కొనన్
మనమున నెంచి యాత్మబల ♦ మండితులై చనుదెంచి రేని నొ
క్క నిముసమాత్రఁ జంపుదును ♦ గాఢపరాక్రమ మొప్ప నెల్లరుం
గనుఁగొన నిట్టి నన్నుఁ గనఁ ♦ గాఁ గలరే యొరులైనఁ జెప్పుమా. 3

సుధే:—నాయనా. నీవంతటివాఁడవే. కాని దైవబల మప్రతిహతము. వా రెన్నివిధములైనఁ గీడుచేయఁ గల్గుదురు. కావున వారి జోలి మానుము. నిన్నునమ్మి మీబావగారు రాజ్యము నిష్కంటకంబుగా నేలుచున్నారు. ఇంతవఱకు నే చింతలు లేని నామనస్సునకు వెతను గల్గింపకుమా. నామాట విను నాయనా, (అని గడ్డముపట్టి వేఁడును).

కీచ:—(అక్కకు నమస్కరించి) మీ రీమాయలాడి మాటలకు భయపడవలదు. గంధర్వులు భర్తలై యుండురేఁడ? ఇది సైరంధ్రిగా మీయొద్ద నుండురేఁడ? ఇది నమ్మఁదగిన మాటయేనా?

సుధే:—సోదరా! ఒక్క సంవత్సరమే యుండునఁట. విధియోగంబున నిట్టియిక్కట్టు గల్గిన దఁట. అది గడచిన వెంటనే యథాపూర్వముగ భర్తలం గూడి యుండి మహోన్నతప్రఖ్యాతినిం గాంచునఁట. కావున నామాటలఁ దూలనాడక యింటికిం బొమ్ము నాయనా.

కీచ:—

చ. విన నిఁక నీదుమాటఁ గడుఁ ♦ వీరుఁడ నౌటను దాని భర్తలన్
[2]బనిపెద ధర్మరాజపుర ♦ వర్యవనంబులఁ గ్రీడసల్పుఁడీ

---

1. స్వశక్తిప్రశంసన మగుట సిది వ్యవసాయము.
2. తర్జనోద్వేజనరూప మగుట నిది ద్యుతి.

యని; తనుఁ గోరు నన్నుఁ దృణ•మట్లుగ నింతియె చూచినన్ బలం
బునఁ గొనిపోదు నింటికిని•బోదునె యూరక రి త్తమాటలన్. 4

సుధే:—ప్రియసోదరా. విను.

ఉ. ఆయు వడంచు భాగ్యములు•నంశము నొందఁగఁ జేయుఁ గీర్తులన్
మాయ మొనర్చు నంతటను•మానక దుర్యశముల్ గణించు నెం
తో యవమాన ముప్పతిల•నొంచుఁ బరాంగన తోడి కేళి యో
నాయన! దానిఁ గోరుదురె•న్యాయవిదుల్ మతిమంతు లెచ్చటన్. 5

కీచ:—సోదరీమణీ!

ఉ. జ్ఞానము గల్గఁ జేసి సమా•జమ్మని వృత్తిని మార్పఁ జూచెదో
మానిని చాలుఁ జాలు బహు•మానము చేసిన యట్లె యెంతు నా
చానను బిల్వనంపి సుఖ•సంపదఁ గూర్పుము లేక యున్న నీ
గానఁగఁ జాల వీవు స్మర•గాఢశరంబులఁ జత్తుఁగావునన్. 6

సుధే:—వత్సా! పెద్దలమాటల నిరాకరించుట హానికరము సుమా.

కీచ:—[1]పెద్దలమాట యీవిషయమున లెక్క సేయను. మరల నామాటనే వర్ణింపకుము.

సుధే:— [2]నాయనా! పెద్దలతో విరోధించుట మంచిది గాదు సుమా.

కీచ:—మంచిదిగాని కాకపోని ఈవిషయమున నే నంగీకరింపఁ జాలను.

సుధే:—(ఆత్మగతము) వీఁ డెంత చెప్పినను దనపట్టును విడువకున్నాఁడు. చాల మూర్ఖుఁడు. ఇంక మంచిమాటలతో లాభము లేదు. ఏదో యొకమాటను జెప్పి యిప్పటికిం బంపెద. (ప్రకాశము) కీచకా. ఎన్ని రీతుల బోధించినను నీ పట్టు దలను మానకున్నావు గదా. కాని, చెంతకు రమ్ము (అని చెవిలో నేమో చెప్పును).

కీచ:— [3](మహానందముతో) సోదరీ! సకలవిధముల నన్నుఁ గాపాడుటకు నీవుఁడఁగా నా కేకొఱఁతయు రాదు.

సుధే:—నాయనా! ఇఁక నీవిట మసలవలదు. ఇంటికిఁ బొమ్ము. దైవము పంచిన ట్లయ్యెడు.

---

1. గురుతిరస్కారరూప మగుట నిది ద్రవము.
2. విరోధశమన మగుట నిది శక్తి.
3. గురుకీర్తనరూపమగుట నిది ప్రసంగము.

కీచ:—నీవు తలంచినట్లే యగు. అన్యథా కార్య మెట్లు సాగును. ఇదె పని వినియెద.

(ఇరువురు నిష్క్రమించుచున్నారు)

[పిమ్మట సైరంధ్రియుఁ గీరవాణియుఁ బ్రవేశింతురు.]

సైరం:—కీరవాణీ! దేవి గారు చెప్పినట్లు పూలహారములు సిద్ధము చేసితివా. నేఁడు పండుగు గదా.

కీర:—నాపనిలోఁ గొఱఁత యుండునా. అన్నియు సిద్ధము చేసి యుంచితిని. చందనమునఁ బరిమళవస్తువులు కలుపునపుడు నిన్నుఁ జెంత నుంచుకొనుమని దేవేరి యానతి. నీవున్నపుడా పని చేయవలయునని నిల్చినాను. తక్కిన పనులన్నియు సిద్ధము చేసితి—(ముందు చూచి తనలో) కీచకుఁడు దేవిగారితో మాట్లాడి వచ్చుచున్నట్లున్నది. మెల్లగా నేను దప్పించుకొనిపోయెద. సైరంధ్రితో నతఁడే మాటలాడుఁ గాక. (ప్రకాశము.) అమ్మా! పూలహారము లందే యుంచివచ్చితి. తెచ్చి నీకుం గనఁబఱచెద.

సైరం—మంచిది. నాకుం గనఁబఱచిన నేమేని లోపములున్నఁ దెలిసినంతవఱకుఁ జెప్పెద.

కీర.—మంచిది— (నిష్క్రమించును.)

(కీచకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కీచ:—(ఆత్మగతము) ఔరా! రొట్టె విఱిగి నేతిలోఁ బడిన ట్లాయెను. నాముద్దుమిటారి యొంటరిగా నిందుఁ గనఁబడినది. పరిచారిక లెవ్వరు నిపుడు దగ్గర లేరు. కీరవాణి నాయుద్యమ మెఱిఁగినది కాన నేమో పనిమీఁదఁ బోవునట్లు నటించి యొకటికిఁ బోయినది. నేనే మాటలాడెద. నామాటలకు లోఁబడక పోవునా. (నాలుగడుగులు వడివడిఁ బెట్టి) సైరంధ్రి యెటుపోవను వీలులేకున్నది. ఇదియే సమయము. (సమీపించి మహానందములో) పూర్ణచంద్రనిభాననా, తరుణీమణీ!

ఉ. ఎవ్వని పుత్త్రివీవు కులమెయ్యది భర్త యెవండు చూడఁగాఁ
బువ్వులు కాని సాయకముఁ బోలి చెలంగుచు నున్నదాన నీ
వెవ్వనిఁ జేరనగ్గ జగములేలు పతిండు నిజంబు పద్మజుం
డెవ్వఁడొ నీసురూపము సృజించెనొ చెప్పుమొయుం దలోదరీ. 7

సైరం—మహాత్మా! నన్నెవ్వరిగాఁ దలంచి మాటలాడుచున్నావో తెలియఁజాలకున్నదాన.

కీచ:—సైరంధ్రీ! వేష మూని వచ్చిన నాభాగ్యముల పంటగాఁ దెలిసిరమ్మ మాటలాడు చున్నవాఁడ వినుము.

## ౧౧ పాట.

సీ. అకలంకపూర్ణశశాంకుఁడే నీమోము సరిపోలనొకవేళఁజాలు నేమొ
మందాకినీహేమమంజులాబ్జంబులే నీకనులను బోలనేర్చు నేమొ
కలశవార్ధి జనించియలరెడు శంఖమే నీగళోపమఁ గననేర్చు నేమొ
స్వర్ణభూధరసంభవముగన్నతీఁగలే నీబాహువులఁ బోలనేర్చు నేమొ
శారదాదివ్యహస్తాంబుజాతధృతవి
పంచికయొ నీ లసద్గళస్వనమునకును
సాటిగా నిల్వఁ గలదేమొ చాన, చెప్పఁ
జాల వర్ణన మిది గాదు సత్య మెన్న. 8

కాంతామణీ! పెక్కుమాట లేల. గాని నీనురూపసంపదరమ్మ నన్నాకర్షించినది. దాసుఁడ. మఱొక్కమాట వినుము.

ఉ. దానములందు శాస్త్రములు తథ్యము చెప్పును బ్రాణ మిచ్చులే
దానము దానిఁ బోలు నవి దానము లెవ్వియు ధాత్రి లేవటం
చో నెలఁతా యిఁకం బలుకకూరక యించుక యుండు వేని నర్క
సూనశరుండు కీడ్పఱుపఁ జూడఁగ నచ్చెనె యెన్ని భంగులన్. 9

కావునఁ గాంతారత్నమా! నన్నుఁ గౌఁగిటం జేర్చి నాకుఁ బ్రాణదానము చేయుము.

సైరం.—(ఆత్మగతము) వీఁడు మదాంధుఁడు. కన్నుగానక మాటలాడు చున్నవాఁడు. సహాయము నాకిట నెవ్వరును లేరు. ఈయంతఃపురమున నితనికి బుద్ధిచెప్ప గల వారెవ్వరును నాకగపడలేదు. ఇఁక మంచిమాట లాడి తప్పించుకొని వీని యమపురికిం బంపునట్లుచేసెద. (ప్రకాశము) రాజతిలకమా నాయున్న యూని కినిం దలంపక ధర్మాధర్మమార్గంబుల నూహింపక నిజంశగౌరవంబు నాలోచిం పక జనాపవాదము గల్గునేమో యని భయంపడక బంధువులు విన్న దలవంపు లగునని సంశయింపక యేమేమో మాటలాడుచున్నా వేల? నావంటి తోఁబు ట్టువులు గల నీబోంట్లే యిట్లు మాటలాడిన ధర్మ మేరీతిఁ బదుకు? జను లేమందురు? కొంచె మాలోచింపుము. మీవంటి గొప్పవారు నాబోటి దుర్జా తిని గోరఁ దగునే, ధర్మంబుఁ గాపాడు క్షత్రియకుమారులే యిట్టి కుమార్గము నవలంబించిన నిఁక దానిని గాపాడు వారెవరు? నాకును నీవు తోఁబుట్టువవు.

ప్రమాదమునఁ బల్కిన పల్కులకు బశ్చాత్తాపప్రాయశ్చిత్తంబునఁ బరిశుద్ధిని గల్పించి సన్మార్గమునఁ బొమ్ము.

కీచ.—అన్నులమిన్నా?

క. తను విధి దుర్జాతియు గా
దని చెప్పక చెప్పుచున్న ♦ దన్యసతిం గూ
డిన వచ్చు పాపమునకున్
మనమున భీతిల్లఁ దాళ ♦ స్మరశరహతికిన్ 10

సైరం:—(ఆత్మగతము) ఇఁక మంచిమాట లీతని యందుఁ బనిసేయఁ జాలవు గట్టిగాఁ జెప్పి చూచెద (ప్రకాశము) కుమతీ!

శా. వైరిస్ఫారపరాక్రమప్రబలదు ♦ ర్వారాబ్ధికుంభోద్భవుల్
సారోదారశరావళీదళితదు ♦ స్తంత్రప్రధానాహితుల్
ధీరుల్ భూరిభుజాబలార్జితయశో ♦ దీప్తుల్ మనోనాథు లె
వ్వారిన్ లెక్కిడ రుక్కడంతురు నినుం ♦ బాపాత్మునిం గ్రుద్ధులై. 11

కీచకా! గంధర్వాకృతులగు నాప్రాణేశ్వరు లైదుగురు సర్వదా సర్వథా నన్ను గాపాడుచుందురు. ప్రల్లదంబు లాడక యూరక పొమ్ము.

కీచ:—చేలా! ఈలీల నాబల మెఱుఁగక పల్కెదు. ఒక్కగంధర్వులే కాదు ముల్లోకంబు లెత్తి వచ్చినను నే భయంపడను. అమాటలకు [1]వీఁడు భయపడఁడని నమ్మి నామనోరథ మీడేర్పుము. దాన నీకు సకలభోగములు సిద్ధించు. ముందు నీవే నాయింటి కధిపురాల వయ్యెదవు. నీకు లభింపని సుఖసంపద లిఁక నుండవు. కాన నామాఁట గైకొని నన్ను సఫలమనోరథుం జేయుము.

౧౧ పాట.

సైరం:—(సక్రోధము) దురాత్మా! పరసతీసంగమమున నెంద ఱెందఱు చెడిరో కాంచె మాలోచింపుము. రావణాదులవార్త లాకర్ణింపుము తలంపుము. పరదారరతింగోరి బాగుపడిన వార లెవ్వరైనఁ గలరా యని, వ్రేలునుడిచి యొక్కనిం జూపుము. ఇఁక నాతో మాటలాడక యూరక వచ్చినదారిఁ బొమ్ము.

కీచ:—ఇంతీ! నీవేమన్నను గోపమొందను. ఏమన్నననుము. నామనో[2]రథము మాత్ర మీడేర్చినం జాలు. భుజాబలమున నన్ను మిగులువారు ముజ్జగముల లేరని

1. సిద్ధామంత్రణమువలని భవిష్యత్ప్రదర్శనరూప మగుట నిది ప్రరోచనము.
2. వికత్థనములఁ దెలుపుటచే నిది విచలనము.

మాత్రము తలంపుము. గంధర్వులే గాదు ముప్పదిమూఁడుకోట్ల దేవతలు నా పేరు విన్న వడవడ వడఁకుదురు. ఇతరుల మాట లెక్కయా. ఇట్టి నన్నుఁ జేపట్టితివా కోరినంతమంది పరిచారికలు గొల్వ సకలభోగముల ననుభవింపఁ గలవు. నామాటఁ బాటింపుము. సకల[1]మనోరథములు ఫలియించును. మనశ్చింతలు తొలఁగును. స్త్రీజాతిస్వభావములగు పలుకులం బల్కకుము. గడు వేసంగద. మరల వచ్చి మాటలాడెద. చక్కఁగా నాలోచించుకొని యిదమిత్థమ్మని తీర్మానించుకొని యుండుము.

సైరం:—గురాత్మా! నీవే యాలోచించుకొనుము. అందని మ్రాఁకుల పండ్లు గోయఁ దలంపకుము. అది మేలుగాదు (ముందునకుదృష్టిసారించి) కీరవాణి వచ్చుచున్నట్లున్నది. (సమీపించి) కీరవాణీ! ఇదిగో వచ్చుచున్న దాన.

(అని యందఱు నిష్క్రమింతురు)

2 (ఇది విమర్శసంధి)

(ఇది చతుర్థాంకము.)



1. కార్యసంగ్రహరూప మగుటనిది యాదానము.
2. విమర్శసంధి సాంతముగాఁ జెప్పఁ బడినది.

# పంచమాంకము.

---

(పిమ్మట నింద్రానుమతిచే నశ్వసేన ప్రమతులను దేవమాత లిరువురు మనుష్యరూపములఁ బ్రవేశించుచున్నారు.)

అశ్వ:—మిత్రమా! మూఁడుదినములనుండియు మన మీపురమున వార్తల నరయుచున్నాము. నీ వేమి పరిశీలించితివి?

ప్రమతి:—సఖా? నేనెన్నియో సంగతులను గనుఁగొంటిని. ఇంద్రుని యాజ్ఞ నెఱవేర్చినట్లే యనుకొనుచున్నాను.

అశ్వ:—ఏవియో నీవుకనుగొన్నవింతలు. పాండవుల కుశలమరసితివా.

ప్రమ:—చక్కఁగాఁ గనుఁగొంటిని. నీకుఁ జెప్పవలయునా.

అశ్వ:—వినఁ గోరుచున్నాను నేనును జక్కఁగాఁ బరీక్షించితి. ఆవిషయమును దరువాతఁ జెప్పెదను.

ప్రమ:—సఖా! విను పాండవు లేవురిందున్నవారు. వారి కేవిషయములయందును గష్టములు గలుగలేదు.

అశ్వ:—వా రెందున్నారు. వారిపేరులెవ్వి?

ప్రమ:—మిత్రమా! చెంతకురమ్ము. (అనిచెవిలో నేమోచెప్పును).

అశ్వ:—(సంతోషముతో) చక్కఁగాఁ దెలిపితివి. సాధుసాధు శుభవృత్తాంతమును విన నోఁచితిని. నేను నొక్కవిషయ మెఱింగియుంటిని. నీవలన నందలివృత్తాంత మెఱుకపడియె.

ప్రమతి:—నీకుఁ దెలిసినవిషయ మెఱిఁగింపుము.

అశ్వ:—మిత్రమా విను. సైరంధ్రియే పాంచాలి, ఆమె సుధేష్ణయొద్ద గౌరవోద్యోగము సంపాదించి యుండెను. ఆ సాధ్విని సుధేష్ణసోదరుఁడు మదాంధుఁడు కీచకుఁడు కోరెను. తొలుతఁ దనయక్కతోఁ జెప్ప నామె నీతులఁ దెలిపి పంపెను సైరంధ్రితోఁ దులువతనమున మాటలాడఁగా నాసతీతిలకము మొదట నీతులఁ దెల్పియు నవ్వల నిష్ఠురోక్తులాడియు నాపిదప బెదరించియుఁ బంపెను. వాఁడామె పలుకుల లెక్కగొనక కొంతయవకాశ మిచ్చి మరలవచ్చెద నని వెళ్లెను.

ప్రమతి:—సఖా! ఈకార్య మెట్లుపరిణమించునో, ఆమె నెవరు గాపాడుదురో అక్కటా! సజ్జనులకే సకలకష్టములు సంభవించునుగదా.

ఆశ్వ:—ఆర్యా! అదె సైరంధ్రి యేకాంతమున నున్న భీమున కీసంగతిని జెప్ప వెళ్లుచున్నది. మనమదృశ్యరూపములఁ బరిశీలింతము రమ్ము.

(అని యిరువురు నిష్క్రమింతురు)

(ఇది విష్కంభము.)

(సైరంధ్రి మహానసగృహమును బ్రవేశించుచున్నది.)

సైరం:—(ఆత్మగతము) నిన్న మొన్ననే భీమసేనుఁ డొడంబడికం జేసి పంపెను. పిట్టపిడుగు[1] నీ వార్త యింతలోనే చెప్పిన నతఁ డాగ్రహావ్యగ్రుఁడై యొడలెఱుంగక త్వరపడి యొక కార్యముచేసిన దాన నేమేని కీడుమూడినచో ధర్మనందనుం డేమనిచింతిల్లునో. ఊరకుండ మున్న వీలులేదు. నేఁడు కీచకుఁ డాడినమాటలకు నాయొడలెల్ల మండుచున్నయవి. ఈ పెనుమంట లానరాధమునిరక్తధారలలో స్నానముచేసినఁ గాని చల్లారవు. ఏది యెటులున్నను భీమసేనున కెఱిఁగింపక తప్పదు. (ముందు నాలుగడుగులు పెట్టి) ఎవరును లేరు నిశ్శబ్దముగ నున్నది. ఇది మంచిసమయము. (అని నడినడిఁ బోయి) ఔరా! ఈతఁడు హాయిగ నిదురించుచున్నవాఁడు నిద్రాభంగము దోషమేయని యూరకుండమున్న మానభంగము కలుగును కానలేపెద (అని మీఁదహస్తముంచును.)

భీమ:—(మెల్లగా నిద్రలేచిన ట్లభినయించుచు) ఇదేమి పాంచాలి యిపుడు వచ్చితివి?

సైరం:—వాయునందనా! ఆనాఁడు మీరు చూచుచుండ దుశ్శాసనాదులచే నవమానింపఁ బడితిని. ఈనాఁడు దిక్కులేని దానివలె మీకుఁ దెలిపికూడఁ గీచకునిచే నవమానింపఁబడఁ బోవుచున్నదాన. ఇట్టి యిక్కట్టున నీపూరకున్న నేజీవింపఁజాల.

భీమ:—ద్రౌపదీ! ఇప్పుడేమి చెప్పఁదగిన వార్త. ఆపాపాత్ముఁడే మైనఁ బ్రల్లదంబు లాడెనా, త్వరగాఁ జెప్పుము. (అని కూరుచుండును.)

సైరం:—ఆదుర్మాత్ముఁ డీదినము నన్నుఁ జూచి పిలిచి యన్నమాటలు నేవచింప నీవాలకింపఁ దగినవి కావు రేపు గడువు దినము. అంగీకరింపకున్న రూపుమాపు నని శపథములు పలికి పోయినాఁడే? నాగతి యేమి?

---

1. పూర్వాంకమునఁ జెప్పఁబడినవిషయము నుత్తరాంకములోని కవతరింపఁ జేయుట యిదియంకావతరణము.

భీము:—(పండ్లు పటపట లాడించుచు) యా! గేని రేపు గడువు దినమా. ఆహా పాత్ముని కాముడు నశించు వినుము. శపథము నేను జేయుచున్నాను, విను.

## ౧౨ పాట.

చం. సురలు ముదంబునం బొదల ♦ శృంగారశిఖామణు లౌర కుంచనన్
గరము దురాత్ముఁడై నిను ని♦కారపు రుక్కులఁ దూలనాడి ని
ర్భరబలశాలి నంచు గరు♦వంబున నొప్పెడు కీచకాధమున్
దర్పగపడి చంపి నీదు వగఁ♦బాపెద భీముఁడ నేనె నైమచో౯. 1

సైరం:—పవననందనా మీయన్నగారానాఁ డుపదేశించిన యజ్ఞాతవాస నియమములు జ్ఞప్తియం దున్నవి కదా, వానికి విరోధము లేకుండఁ బ్రవర్తిల్లవలయు. ఏమాత్రము హాస్యమిాఱి ప్రవర్తించితివా మన శ్రమముల కంతమే యుండదు.

భీము:—పాంచాలీ! ఉత్త తెలుఁగని శిల మెత్తునా. మన సెఱుఁగని కలనచ్చునా? ఈస్వల్పకార్యమున కంతో ప్రయాసను వలయునా.

సైరం:—ఎట్టులకార్యమును సాధింప నూహించితివి.

2 పాంచాలీ నీమనఃఖేదమును బాపి ధర్మజునకుం దక్కిన తమ్ములకును మనస్సంతోషమును గల్గించెద.

భీము:—3రేపు బుద్ధిలేక యాతఁడు వచ్చి మరల నెప్పటి యట్ల మాటాడఁ బూనె నేని హితవాక్యము లుపదేశించినట్లు నటించి యాతని నొకసంకేతస్థలము నిశ్చయించి యచటికి రాత్రి రెండవజాముననరమ్మని చెప్పుము. నేను నీతోవచ్చి యతనికి శాశ్వతానంద మొనఁగూర్చెద:

సైరం:—మహాబలశాలి కీచకుఁడు. మదాంధుఁడు. నిరాయుధుఁడవగు నీవాతనితో నెట్లు పోరాడి జయింతువాయను శంక కలుగుచున్నది.

భీము:—(బొమగంటి) అట్టి సంశయము నీకుఁ గల్గెనదా వినుము.

ఉ. శాతనఖాంకురాలం బ్రబల ♦ సత్వము పొంగఁగ సింహశాబకం
4బాతురత౯ మదావిలను ♦ హస్తిసంఘము గంపవించున
ట్లోతరుణీమణీ! మగతి ♦ మస్తము కీచకు ముష్టిజానునం
ఘాతములం గృతాంతపురిఁ ♦ గాపుర ముప్పఁగఁ జేయఁ బంపెద౯. 2

---

1 ప్రసిద్ధబీజనిర్వహణము వలన నిది నిర్వహణసంధి ప్రారంభింపఁబడియె.
2. సుప్రసిద్ధబీజోపగమన మగుట నిది సంధి.
3. ప్రస్తుతకార్యమార్గణ మగుట నిది విబోధము.
4 కార్యాక్షేపణరూప మగుట నిది గ్రథనము.

సైరం:—(సంతోషముతో) మారుతనందనా! నీవంతటి వాఁడవే, ఐనను మీరుభయులు పెనఁగునపు డార్చిన నలుగురకుఁ దెలియక యుండునా అని సందియ మందెద.

భీము:—పాంచాలరాజనందనా! నాబాహువులం జిక్కి వాఁడూరక చచ్చుటయే కాని నోరెత్తి యార్చుట సంభవించునా నాక్రోధాగ్నిజ్వాలల కాతఁడు తొలి యాహుతియే యగుఁగాని బ్రదికి పోవుటగాని, నాగతి యిట్లాయెనని యార్చుటగాని కలుగదు నమ్ముము. త్రిశుద్ధిగ నమ్ముము.

సైరం:—నాకట్టి నమ్మకము కలిగియుండుటంబట్టియే యీవేళ నీతావున రాఁజాలితి. నీసాయము కలుగదని తెలిసియేయున్న నీపాంచాలి పంచత్వ మొందియే యుండదా.

భీము:—ద్రౌపదీ! అట్టి యశుభోక్తుల రానీయకుము. ఎన్నఁడు గాని నీకవమానము రానీయను. ఆనాఁడు ధర్మనందను నాజ్ఞాదృఢపాశబద్ధుఁడనై శవమువలె నూరకుంటిని గాని లేకున్న నెవ్వరెవ్వ రేమయ్యెడువారో, (అని భుజాస్ఫాలనము చేయఁబోవును)

సైరం:—(చేయిపట్టుకొని) భీమసేనా! ఈభుజాస్ఫాలనము నెవ్వరే విన్నచో నిపుడే కార్యభంగమగునే, ముందేమి పనిసాగును, నీకాగ్రహము కలిగినపు డొడలెఱుఁగక యేమి సేసెదవో యనుసందియము మాత్రము మానఁజాలకున్నదాన.

భీము:—(చిఱునవ్వుతో) బేలా! కార్యమెట్లు నడుపఁదగునో తెలి[1]యని వాఁడనా? మహారణ్యమున హిడింబాసురునితోఁ బోరాడునపుడు సోదరులకును దల్లికిని నిద్రాభంగము కాకుండ వానిని వెనుకకు నెట్టి కొంతదవ్వు గొనిపోయి మర్దించి చంపిన యావాఁటి యనుభవము నాకున్నది సుమీ.

సైరం:—[2]వాయుకుమారా! నీకుఁ దెలియని యెఱుఁగని సంగతులు నేఁ జెప్పరాలేదు. అబల నగుట సంశయించితి. అసందియములు మానితివి. ఇఁక నేపు దురాత్మునకు శతసంవత్సరములు నిండెనని నమ్మి హాయిగ నిద్రించెద. నీయానతిచొప్పున సంకేతస్థలము నిర్ణయించి కాలమునుం దెలిపి యీవిధమంతయు నీకెఱింగించెద. ఇఁక నేఁజేయఁదగిన పని నుపదేశించి పంపుము

భీము:—[3] పాండవభాగ్యదేవతా! ఇఁక నీవూఱడిల్లు మూఱడిల్లుము. శత్రుకులమును

1 అనుభూతాఖ్యాన మగుట నిది నిర్ణయము.

2 పరస్పరసమయానుగుణజల్పన మగుట నిది పరిభాషణము.

3 పర్యుపాసనరూప మగుట నిది ప్రసాదము.

నశింపఁజేసి నిన్ను సంతోషాంబుధినిమగ్నఁ గావించెదను. నిర్భయముగ నిస్సంశయముగ నిరుపద్రవముగ నిర్భరానందముగ నిస్సపత్నముగ వర్ధిల్లుదువు గాక. నీకిట్టి యుత్సాహము నిదె యీభీమసేనుఁడు కల్పింపఁగలఁడని మాటిమాటికి నమ్ముమా. నమ్ముము

సైరం:— మరున్నందనా.

ఉ. [1]కోరిక లెల్లఁ బండె మదిఁ గొంకొక యింతయు నింక లేదు నీ
వారసి శాంతమూని సమయంబునకుం దగు శక్తిఁ జూపి దు
ర్వారమద ప్రమోహగురు భారసదావిలచిత్తుఁ గీచకున్
నేరుపుమీఱఁ జంపి కులనీతిని గాచి యశంబు నిల్పుమా. 3

భీము:— పాంచాలీ! ఇఁకఁ దడవు సేయనేల, ఎవ్వరేని కాంచిన నింతయు వేఱురీతిని మార్పునొందును. నిశ్చింత స్వాంతవై యింటికరుగుము

సైరం:— వాయుకుమారా, నా సంశయములు దూరముగాఁ దొలఁగినవి. ఇఁక నింటికిం బోయెద (అని యించుక సంశయించినట్లుండును.)

భీము:— పాంచాలీ! వినుము.

[2]క. సందియములఁ బొందకు మో
సుందరి నీశత్రు వెంత శూరుఁడై యైనన్
డెందమున శంక నొందక
ఖండించెద రేపు చూడు మాటలికేలా. 4

(చేరఁదీసికొని) తరుణీమణీ వశస్సంశయములఁ బాఱఁద్రోలుము. ఇఁక హాయిగ నుండుము. రేపు కీచకుఁ డీభూలోకమున నుండఁ డనుట సత్యవాక్యమని విశ్వసింపుము. ఇదె ప్రమాణముచేసెద (అని కరమునఁ గరమిడుచున్నాఁడు.)

సైరం:— మరున్నందనా! నీవను దేవతాప్రత్యక్షము నిడనున్న నాకును సంశయమా. స్త్రీబుద్ధిగాన నించుక యనుమానించుచున్నది. రేపు వాఁడే వచ్చిన నీయానతి రీతిఁ జెప్పి పుచ్చి నీచెంత కారులెఱుఁగకుండ వచ్చి తెల్పెద. తరువాత కృత్య మొనర్చి శాశ్వతకీర్తినొందుము. ఇదె పోయివచ్చెద.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

---

1 వాంఛితావాప్తి రూప మగుట నిది యానందము.

2 దుఃఖనిగ్రహణరూప మగుట నిది సమయము:

(కుమతిలోనగు దుర్యోధనచారులు ప్రవేశించుచున్నారు)

కుమతి:— చారులారా! మన మీనగరంబునఁ జక్కఁగాఁ దిరిగి పరీక్షింపవలయునని వచ్చితిమి. మనవేషభాషలు వారు తెలియంగకుండఁ జేయునవియే. కాని మూఁడు దినముల నుండి మీ రేవార్తలం గంటిరి.

చారు:— బ్రాహ్మణవేషము ధరించితిమి గాన నన్నితావులం దిరుగుచున్నారము. నిన్న రాజదర్శనము చేసితిమి. ఆయాస్థలములఁ దిరిగి విచారింపవలసిన రీతిఁ గనుగొంటిమి. క్రొత్తవార్త లేవియుఁ దెలియ రాలేదు. ఇంకను బరీక్షింపవలయు నని యోంచియున్నాము. మీకేమేని వింతలు తెలియ వచ్చినవియా.

కుమ:— నిన్న సాయంకాలము ద్వారకాపురవాసి బ్రాహ్మణునిం జూచితి. పాండవుల వెదకుటకుగా వచ్చిన ట్లాతని మాటల జాడంబట్టి తెలిసికొంటిని. కృష్ణుఁడు పంపియుండునేమో యని తలంచెదను. ఎవరెవరు వచ్చియున్నారని యడిగితి. ఆతఁ డేమో యసందర్భముగ మాటలాడెఁ గాని చక్కఁగా నుత్తర మీయ లేదు.

చారు:— కృష్ణునకుం గూడఁ బాండవులజాడ తెలియదని యూహింప నవకాశ మేర్పడినదికదా. ఇఁకఁ బాండవులు ప్రాణములతో నున్నయట్లు మన మూహింపరాదు. కృష్ణుఁడు పాండవులకుం బరమబంధువు కదా. ఆయన కెఱుఁగ కున్నచో వారీలోకమును విడిచిరనియే యూహింపవచ్చును, మనకష్టము తప్పినట్లే.

కుమ:— ఆయూహ సరికాదు. కృష్ణుఁడు తెలియనట్లు నటించుచున్నాఁడేమో. ఎవరికిఁ దెలిసినను వెల్లడి యగునని వారు తమవర్తనములఁ దెలుపకుండవచ్చు. నిన్న నకులునివలె నున్నవాని నొకనిం జూచితి. తుదకాతఁ డశ్వసంఘాధిపతి యని తెలియవచ్చెను. మొదట చాల సంతోషించితిఁ గాని యవల నాసంతసము నిష్ఫలమాయె. ఇఁక నేమిచేయవలయునని మీరూహించుచున్నారు?

చారు:— రెండు మూఁడు స్థలములు పరిశీలింప వలసియున్నయవి. ఆమీఁదిసంగతి తరువాత నూహింప వచ్చునని మాతలంపు.

కుమ:— రేపు నిపుణముగాఁ బరీక్షింపుఁడు. ద్వారకాపురవాసు లెవరెవరు వచ్చియున్నవారో పరికింపుఁడు. వారి చర్యలంబట్టి వారి యింగితము తెలియుఁడు. రేపు సాయంకాలమింటికే మనమందఱము కూడవలయు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

(సైరంధ్రి యింటి నుండునపుడు కీచకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కీచ:—ప్రేయసీ! నిన్న నీకిచ్చిన యవకాశమును సఫలముచేసితివా. లేక యట్లే వేలవై పట్టుపట్టి యున్నదానవా.

సైరం:—(ఊరకుండును)

కీచ:—(తనలో) ఏమో మెత్తఁబడిన జాడ కనుపట్టుచున్నది. ఇఁకను ఆశగొలిపి నమ్మకము పుట్టించెద. (ప్రకాశము) అన్నులమిన్నా. నాపలు కొకటి యాలకింపుము.

సీ. చతురబ్ధివలయిత♦ధాత్రీచక్ర మెల్ల నీ
వశ మొనర్చెద నేల♦వచ్చుఁ దరుణి
సురపురిఁ గల కల్ప♦తరువులఁ దెచ్చి నీ
చెంత నిల్పెదఁ దృప్తిఁ♦జెందు ముబల
సంద్రముల్ గలఁచి చం♦చద్రత్నములఁ దెచ్చి
యర్పించెదం బ్రీతి♦నలరు మింతి
ధనదుని నిధులను♦దప్పక కొని వచ్చి
యిచ్చెద ముదమందు♦మచ్చకంటి
నింక నేమేమి కోరెదో♦యేను నీకుఁ
గొఱఁత లేకుండ నిచ్చెదఁ♦గోర్కె మీఱ
నన్ను బిగికౌఁగిటం జేర్పు♦మన్న మున్న
త్రిజగముల నేలినట్లై సం♦తృప్తిఁ గనుదు. 5

సైరం:—పుణ్యజనా! నా వ్రతమును గాపాడుట నీకుధర్మము. పరసతిని ప్రేయసీ, అన్నులమిన్నా యని పిలువఁ దగునే. మహాపాపము గదా.

కీచ:—పరసతియైనచో నట్లు పిలువఁగూడదు. అవార్థ నేనెఱుఁగనా. ఆభావమునఁ బిలువలేదు. నా ప్రాణేశ్వరి యనియే పిల్చుచున్నవాఁడ.

సైరం:—ఆభావము నీకుండఁగూడదు. అది మంచిమార్గము కాదు.

కీచ:—ఆభావము నాకు లేదు గనుక నే యట్లు పిలిచితిని. తప్పేమి యున్నది?

సైరం:—అయ్యో! పుణ్యజనాగ్రగణ్యా! కామాంధుఁడవై యేమేమో మాటలాడుచున్నవాఁడవు.

కీచ:—తరుణీతిలకమా! కామాంధత్వమును గరుణారసాంజనముచే బోఁగొట్టి నన్నుం గాపాడుము.

సైరం:—అది యీరూఢ మున్నంతవఱకుఁ బోఁగొట్ట శక్యముగాదు.

కీచ:—రూపాంతరముం బూనెద. అప్పుడైనం బోఁగొట్టి కృతకృత్యుం జేయరాదా.

సైరం:—అప్పుడది తనంతనే పోవును. ఇప్పటి ప్రయత్న మద్దానికిం జాలదు. గొప్ప ప్రయత్నము చేయవలయును. అంత యేల?

కీచ:—ఎంత ప్రయత్నమైనను జేసెద. ఎన్నిపాట్లు పడవలయు నన్నను బడియెద. ఆయుపాయమును జెప్పుమా.

సైరం:—నాభావము నీవు చక్కఁగాఁ దెలిసికొన్న జాడ గానరాదు. దూరమాలోచింపుము నలుగురు విన్నఁ దలఁపు లగును.

కీచ:—నీభావము చక్కఁగాఁ దెలిసికొనియే యింతమారము పరితపించుచున్నవాఁడ. నీసాంగత్యము నభిలషించి యింతదూరము వేఁడుచున్నవాఁడ.

సైరం:—నాభావము నీయందెట్టిదో ముందు నీకే తెలియఁగలదు. నాసాంగత్యము నీకు శాశ్వతానందపదము సేయఁగలదు.

౧3 పా:

కీచ:—అబ్బా! నేఁటికి నాజన్మము కృతార్థమయ్యెను. నాకోరికలు ఫలించెను. తరుణీ! శాశ్వతానందము ననుభవింపఁ గోరుచుండా నీసాంగత్య మపేక్షించి యింత దూరము దీనుఁడనై ప్రార్థించుచున్నవాఁడ. తడవుసేయక నాకాంక్ష దీర్పుము.

సైరం:—నాసాంగత్యమునే కోరితివా నేఁటితో నీజన్మము కృతార్థము కాఁగలదు. మరల నేకోరికలును బుట్టవు. మఱియు నీజన్మమున నితరతరుణీవాంఛ నీకుఁ గలుగదని గట్టిగాఁ జెప్పఁగలను.

కీచ:—నీసాంగత్యమునె కోరితిని నేఁటికి నాకోరికలు ఫలించుఁగాక. ఇతరతరుణీవాంఛ నొందను ప్రకరణశుద్ధిగా నమ్ముమా. నీవాగ్దానమును జెల్లింపుము. (అని పట్టుకొనఁ బోవును)

సైరం:—సమయ మెఱుఁగక యిట్లు కోరుట న్యాయమా. నాకోరికయు నీకోరికయు రహస్యమున ఫలించునవి గాని యిప్పుడు ఫలించునవి కావు కదా.

కీచ:—చానా! సమయ మెప్పుడో తెల్పుము. ప్రాణము లంతదాక నెట్లో భరించి యుంచుకొనియెద. తడవు సేయకుము. మన్మథుఁడు కరుణావిహీనుఁడై నన్ను విరిశరముల నొంచుచున్నవాఁడు. తాళఁజాల.

సైరం:—చానా యనకుము. సాధ్వియనుము. ఇప్పటి కది తగినమాట. పుష్పశరముల తాకునకే యోర్వఁజాలకున్న నీవిఁక నిశాతనఖముఖవిదారణముల కెట్లోర్వఁగలవు.

కీచ:—సాధ్వీ యనిపిల్చెద, నీవేమని కోరినను యిట్లో యట్లే ప్రవర్తించెద. నఖక్షతములు దేహమున సోఁకినప్పుడవి యింపుగానుండి మహానందమును గూర్చును జుమీ.

సైరం:—నీకౌతుకమే కోరలయఁ గాఁబోలు. కొంతకాలము వేచియుండుము. నీవాంఛ ఫలింపఁజేసెద

# షష్ఠాంకము.



[పిదప నింద్రుని పనుపునఁ బ్రహాసనవిహాసనులను నిరువురు దేవదూతలు మానుషరూపములఁ బ్రవేశింతురు.]

ప్రథముఁడు:—మిత్రమా! మన మీవిరాటపురమున మూఁడు దినము లుంటిమి. ఇంద్రునియానతి జనదాటక మొనరించితిమి. వచ్చినపని యైనట్లే తలంపవచ్చు.

ద్వితీ:—సఖా! కలిసి తిరిగియున్న బాగుండును. వేఱువేఱ మనము చరించితిమి. కావున నాకేసంగతి తెలియరాలేదు. నీకుఁ దెలిసిన విషయమును జెప్పుము.

ప్రథ:—విహాసనా! నీవు చూచిన దేమియు లేదా. పాండవుల వార్తల నెఱింగితిని జుమీ.

ద్వితీ:—ప్రహాసనా! ఆవార్తలం జెప్పుమా విన వేడుక యగుచున్నయది.

ప్రథ:—నిన్న రాత్రి జరగిన విషయ మత్యద్భుతము. వింటివా లేదా.

ద్వితీ:—నే నేమియు వినలేదు. ఆవార్తలఁ జెప్పుమా.

ప్రథ:—విరాటుని బావమఱఁది కీచకుఁడని వినియున్నావా, అదియును లేదా.

ద్వితీ:—వినియున్నాను అయిన వాని విషయమేమి ?

ప్రథ:—ఆకీచకుఁడు మనకంటె ముందు స్వర్గమునకుఁ బోయి యున్నాఁడు.

ద్వితీ:—(ఆశ్చర్యముతో) ఆ! వాఁడు సింహబలుఁడు కదా. వాని నెవరు చంపిరి. లేదా రోగమునఁ జచ్చెనా.

ప్రథ:—మనోరోగపీడితుఁడై యొకరి చేత దిక్కులేని వానివలెఁ జచ్చినాఁడు.

ద్వితీ:—అంతటి బలశాలి యెవఁడు?

ప్రథ:—అరాతి ప్రమథనప్రచండదోర్దండుఁ డగు మరున్నందనుం డాతని రాత్రి నొక్కనిం జంపెను.

ద్వితీ:—(ముక్కుపై వ్రేలు వైచుకొని) ఆ! భీముఁడే యాతనిం జంపెనా? ఎట్లు?

ప్రథ:—వినుము. సైరంధ్రిని గీచకుఁడు కోరగా నామె యిది యుక్తము కాదని యెన్ని విధముల హిత ముపదేశించినను వినక పోవుటచే నామె యెట్లో తప్పించుకొని భీమున కావార్తం దెల్పెను భీముఁ డందుల కవార్యక్రోధోద్దీపితుఁడై సైరంధ్రి భీతిమాన్పి రేపు మరల వాఁడు నీచెంత కరుదెంచెనేని నర్తనశాలకు రాత్రి రెండవజామున రమ్మని చెప్పి పంపి యావార్తను దనకుం దెల్పుమని పంప

సైరంధ్రి యట్లే తెల్పెను. భీముఁడు తాను స్త్రీవేషమును ధరించినట్లు నర్తనశాలం ప్రవేశించి సైరంధ్రి నొకచో నునిచి వేచియుండు నంతలోఁ గీచకుఁడు కామోద్రేకమున సంకేతానుసార మొంటిగావచ్చి యందు శయనించినది సైరంధ్రిగా భావించి చేఁతకేగి యేమో మాటలాడుచుండఁగా భీముఁడు వాని నశక్తుంగా భావించి ముష్టి జానుఘాతంబులం బిండిసేసెను. ఇదియు కీచకుని వృత్తాంతము.

ద్వితీ:—ప్రహసనా! కీచకునకు సోదరులు పెక్కుమంది గలరని వినియున్నవారము కదా. వారనంతర మేమిచేసిరి?

ప్రథ:—దొమ్మియుద్ధము సాగుచున్నది నాయనప్పు డెట్లో గ్రహించి వారు కీచకుని మోచికొని సైరంధ్రిని గూడ మోచికొని శ్మశానమునకుం బోవ భీమసేనుం డావిధ మెఱింగి యందుఁ జేరి యొక్కఁడైన జీవింపకుండ మృతిఁబొందించి వచ్చెను.

ద్వితీ:—అక్కటా! పాండవులకు మరల నరణ్యవాసము ప్రాప్తించినట్లే కదా.

ప్రథ:—అట్లుకాదు. కీచకుని జంపినది గంధర్వులనియే యందఱ తాత్పర్యము. కాఁబట్టి పాండవుల కేకష్టములు రాఁజాలవు.

ద్వితీ:—మన మీవార్తల నింద్రునకుం జెప్పవలయుఁగదా. మాటల సందడిలో జాగు సేసితిమి? పోదము రా.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

[సుమతి లోనగువారు దుర్యోధనసభను ప్రవేశించుచున్నారు]

చారులు:—జయము జయము మహారాజుగారికి.

కర్ణుఁడు:—ఏమి శుభవార్తలు తెచ్చితిరి?

సుమతి:—మా ప్రభువుని యాజ్ఞ గైకొని వారిజాడ గనిపెట్టవలెనని పరిపరివిధముల పాట్లు పడితిమి. తిరుగ శక్యముగాని తావులను గూడ సంచరించి పరికించితిమి. అంతియ కాక నదులు వనములు కొండలు సకల స్థలములయందును వెదకితిమి. ఎందైనను వారిజాడ కొంచెమైనను గానరాలేదు. ద్వారకనుండి కృష్ణునిపంపున నొకవిప్రుఁడు వారిజాడ లరయ వచ్చియుండుట మత్స్యనగరంబునం జూచితిమి. అతఁడును మావలెనే మోము వ్రేలవైచుకొని పోయినాఁడు

కర్ణుఁడు:—ఇప్పుడు మీతాత్పర్యము పాండవు లీభూమియందే లేరనియే కదా.

సుమతి:—సత్యముగా నదియే. లేకున్న సకలమాయలను బన్ని పరీక్షించినఁ గానరాకుందురా వారెన్నఁడో మృతినొంది యుందురు.

కర్ణుఁడు:—ఎందుఁగాని విచిత్రవృత్తాంతము మీకు వినఁబడలేదు కదా.

సుమతి:—(ఆలోచించి) అంగరాజా! విరటునగరంబున నొక్క విచిత్రవార్త వినవచ్చి

నది. సైరంధ్రి యను నొక తరుణి కీచకుఁడు మోహింప నొకరాత్రి యాతని సోదరయుతముగ గంధర్వు లేవురు చంపినారఁట. కీచకుఁడు సోదరులతో మడియుట మాత్రము నిశ్చయము. పట్టణమంతయుఁ బురపుర పొక్కుచున్న యది.

శకు:—మహారాజా! గంధర్వు లేవురనఁగాఁ బాండవులే. సైరంధ్రి యనఁగా ద్రౌపదియే. ఒరులు కీచకునిం జంప నోపుదురే.

దుర్యో:—కీచకుఁ డుండుటంబట్టియే విరాటుఁ డొక ప్రభువుగా నిర్భయముగ నుండినాఁడు. కీచకుఁడే పోయిన నిఁక నతనికి రాజ్యము పోయినట్లే.

కర్ణు:—మహాప్రభూ! నిస్సంశయముగఁ బాండవు లందుందురు. సకలసస్యపరిపూర్ణమై యారాజ్య మలరుచుండుట విస్తారము కదా. ధర్మజుఁ డున్నచోటఁ బాఁడి పంటలు చక్కఁగా నుండునని భీష్మ ద్రోణులు చెప్పియుండిరి. విశేషించి యీవత్సరమున విరాటునిపాల గోధనము గలదని వినియున్నాము కదా. కాఁబట్టి యందే యుందురు.

సుశర్మ:—మహీపాలకా! నేఁటికి నా మనస్వప్నము పండినది. కొంతకాలమునకు ముందుఁ గేకయసాల్వరాజులుగాఁ గీచకుండు నన్ను సంగరమున నోడించినాఁడు. వాఁడు ప్రాణములతో నుండుతఱి మరల యుద్ధము పొసఁగక పోయెను. ఇపుడు సమయము దొరకినది. నాకనుజ్ఞ యిచ్చిన నాబలంబులం గూడి పోయి యాతని గోధనంబుల ముట్టి తెచ్చెద.

శకు:—ఈనాట పొసఁగి యున్నది. సుశర్మ దక్షిణదిక్కున ముట్టడించినఁ బాండవు లప్పురి నున్నవారగుట నా రాజునకుం దోడు వత్తురు.

దుర్యో:—సుశర్మ దక్షిణభాగము ముట్టడించుగాక. అనుఱునాఁడే మన ముత్తరమున వ్యాపించి యమూల్యగోధనమును బట్టుదము. పాండవులుండిరా వత్తురు. లేక యుండిరా గోధనలాభము కలుగును. ఇఁక వేగమె సుశర్మ బలములతోఁ బోవలయును. మనము సైనికులఁ బిలిపించి కట్టాయితంబై యుండవలయు నని తెల్పవలయు.

శకు:—చాల మంచి యూహ యిది. ప్రశస్తముగ నున్నది. పాండవులు జీవించియే యుండిరేని విరాటునకు సాయముగా వత్తురు భూలోకమును వదలియున్నచో నమూల్య గోలాభము కలుగు. కీచకుఁడు లేఁడుగాన నాతనిని జయించుట సుకరమై యుండు.

దుశ్శా:—సేనాధిపతులందఱును తమతమసైన్యములఁ గట్టాయితంబై యుండ నాజ్ఞాపింతురుగాక. రాజశాసనమును తెల్పుదురుగాక. రేపే సుశర్మ పయనమై విరాటుని

పురంబును దక్షిణభాగంబు నరికట్టి యుద్ధము చేయును గాక. అందుఁ బాండవుల చొప్పరయుచుండును గాక. ఎల్లండియే మనము సకలవాహినీపరివృతులమై యుత్తరభాగంబున నిలిచి గోధనమును మరలింతుము. పాండవులజాడ తెలియక పోదు.

దుర్యో:—

తే. జాగుసేయకుఁడిగా మీరు సకలకృత్య
ములను నడిపింపుఁ డీ పెద్దకలహ మైన
నెట్లు కురువీర సేనల నట్లు గూర్చి
పయన మొప్పంగఁ జేయుఁడీ పట్టసంద. 1

ఇంకఁ ద్వరపడుఁడు. సర్వసన్నాహంబు లొనరింపుఁడు. త్రోవలో నెట్టి సౌకర్యము లుండవలయునో యేమఱక వానిఁ గనుఁగొనుటకు గొందఱ నియమింపుఁడు.

(అని యందఱు నిష్క్రమింతురు)

(పిదప సైరంధ్రియు బృహన్నలయు బ్రవేశించుచున్నారు)

బృహ— 1పాంచాలరాజనందనా! శత్రువృత్తిచే నీమనశ్చింత పోయినదిక దా. నీకష్టములు గట్టెక్కినవి. ఇంకఁ ద్వరలో శత్రువుల జయించి ధర్మజుఁడు పట్టాభిషిక్తుఁడు కాఁగలఁడు. అప్పుడు మిగిలిన నీకోరికలన్నియుఁ దీరును గాక.

సైరం— 2మీవంటి దేవాంశసంభూతులు భర్తలుండఁగా నాకు నెఱవేఱని కోర్కెలుండునా? శత్రుక్షయమాయె. సంతోషార్హము లభించెను. గౌరవము నిలుపుకొనఁ గలిగితి.

బృహ:— 3దక్షిణదిక్కును సుశర్మ ముట్టడించెను. ధర్మజాదులు సహాయమేగిరి. జయము విరటునకు గల్గుట కొక సంశయమా? మన కష్టదినములు గడచినవి. మన మిట భయములేక మాటలాడుచుండుటయే మనశ్చింతలు తొలఁగుటకొక దృష్టాంతము.

సైరం:— దుర్దినములు గడచినవి. దిక్కులు స్వచ్ఛము లగుచున్నట్లే మనమనస్సులు నిర్మలము లగుచున్నయవి. ఇఁక నీబాహుసారము త్రిజగద్విఖ్యాతము చేయుటకుఁ దగిన సమయము మరుదెంచుచున్నది.

బృహ:— (కుడిబుజ మెగురుటఁ బరికించి) పాంచాలి కుడిబుజ మేలొకో యదరుచున్నది. యుద్ధమాసన్న మగునపుడు తోఁచులక్షణములు నాకుం బొడకట్టుచున్నయవి.

---

1 లబ్ధార్థశమన మగుట నిది కృతి.

2 మానాద్యాప్తిరూప మగుట నిది భాషణము.

3 కార్యదర్శన మగుట నిది పూర్వభావము.

(కేకలు వినఁబడఁగా వాలించి) వీథిలో నేమో కోలాహలశబ్దము కలుగు చున్నది. కారణమేమో (చక్కఁగా నాలకించి) ఉత్తరభాగమును గురురాజు సైన్యముతో ముట్టడించె నఁట. పాంచాలీ! యుద్ధ మాసన్నమైనది. పురమున వీరు లెవ్వరును లేరు.

సైరం:—ఇంద్రనందనా! ఉత్తరకుమారుఁ డున్నవాఁడు. ఈవార్త విని యతఁ డేమి చేయునో తెలిసికొని వచ్చెద. సారథ్యమునకు నీపేరు చెప్పెద. సంగరరంగము చూడఁగనే మీరిద్దఱు అధికారముల మార్చుకొనఁ గలరు. ఇదె పోయి వచ్చెద.

(అని నిష్క్రమించును)

[తరువాత నుత్తరుఁడు మిత్రులతోఁ బ్రవేశించుచున్నాఁడు.]

ఉత్త:—సఖా! మాతండ్రిగారు సుశర్మ నోడింపఁ బోవుట సంతోషమే గాని కంకుఁడు వలలుఁడు, దామగ్రంథియుఁ, దంత్రీపాలుఁడు యుద్ధమునకుఁ దోడుగాఁ బోవుటయు, వీరిరాకకుఁ దండ్రిగారు సమ్మతించుటయు నాకంతగా సరిపడ లేదు సుమా.

సురుచి:—రాజకుమారరత్నమా! ఏలినవారికి వీరిసహాయ మవసరమే లేదు. కాలక్షేప మున కెప్పుడు చెంతనుండుట ధర్మరాజును, బాహుయుద్ధమున మల్లర నోడించి యుండుట వలలుని, అశ్వహయాధ్యక్షులగు దామగ్రంధి తంత్రీపాలు రిద్దఱు మిగుల రూపవంతులై శౌర్యధుర్యులుగాఁ దోఁచుచుండుట వారలను బిలుచుకొని పోయి యుందురని తోఁచెడు.

ఉత్త:—నీవు చెప్పినమాట బాగున్నది. కాని వీరి సాయము లేకున్న జయము చేకూర దనియా.

సురుచి:—కాదు కాదు. అప్రయాణకాలమునకు వారు మేము వత్తుమని ప్రార్థించి యుందురు గాన నంగీకరించి యుందురే కాని వేఱుగాదు.

ఉత్త:—(కొంచెము చెవి యొగ్గివిని) ఆ ఏ మీకలకలము? ఏ మీమాటలు?

(దూతలు ప్రవేశించుచున్నారు)

దూత:—(వగర్చుచు) మహారాజకుమారకా! కౌరవసైన్యములు ధేనువుల నావరించి పాలకులం దోలి వానిని గొని పోవుచున్నారు. పరుగున వచ్చితిమి. తర్వాత దేవరచిత్తము.

ఉత్త:—(ముక్కు మీఁద వ్రేలుంచి) ఆ! కౌరవసేనలు మనధేనువుల ముట్టడించి నారా.

దూత:—ముట్టడించుటే కాదు. తోలుకొని పోవుచున్నారు.

ఉత్త:—గోరక్షకు లేమైరి. వచ్చినారా.

దూత:—కౌరవసేనల ముందఱ మన ధేనుపాలకు లేపాటి వీరులు?

ఉత్త:—కౌరవులకు మనవారు చాలరా. వారేమి మహాశూరులని మీ తాత్పర్యము.

దూత:—సకలాయుధ ధారులై వచ్చిన శూరులకు మనధేనుపాలకులకు నెంత యంతరంబు? వారిని దేరిచూడ నైన మనవారికి శక్యమా మహాప్రభూ!

ఉత్త:—ఇస్సీ! నీ! నాపేరు చెప్పిన వారు పాఱిపోదురే. అంత మాత్రము దోఁచక పోయినదా.

దూత:—యువరాజా! వారిరాక పెద్దయెత్తుగాఁ గనఁబడుచున్నది. సామాన్యప్రయత్నము గాదు. కావున గోపాలకుల కది శక్యము గాదు.

ఉత్త:—(కన్నులెఱ్ఱచేసి) ఏమీ! వారి బలమెంత? వారి పరాక్రమ మెంత? వారి ప్రయత్నమెంత? వారి నెదిరించుటకు గొప్ప ప్రయత్నము కావలయునా. ఏమి తెలివితక్కువగా మాట లాడుచున్నారు.

దూత:—నిశ్చయముగా మేమెల్ల భయార్తుల మైతిమి. ఇంకను గాళ్లు వడఁకు చున్నయవి. ఆ చతురంగబలములఁ జూచిన మాబోంట్లు నిలువఁ గలరా. ఏలినవారి పాదముల చెంతకువచ్చిన తర్వాత నిపుడు భీతి కొంచెము తగ్గుచున్నది ఇపుడైనను ఆసేనలఁ దలంచుకొంటిమా, (అబ్బా యని మూర్ఛిల్లుదురు).

ఉత్త:—(చిఱునవ్వుతో) సఖా! నిశ్చయముగా వీరు భయపడినారు. పిఱికితనమువీరి నింకను బాధించుచున్నది. నడుము కట్టవలసిన కాలమిది. ఇంకఁ దడవు సేయ రాదు.

(ఇంతలో ఉత్తర ప్రవేశించుచున్నది.)

ఉత్తర:—అన్నగారూ! మనగోధనమును గౌరవులు ఆక్రమించిరని విన్నాను. నిశ్చయమేనా?

ఉత్త:—సోదరీమణీ! నిశ్చయమే నఁట. ఇపుడే దూత లీవార్తను దెల్పుచున్నారు:

ఉత్తర:—ముందు గతి యేమి?

ఉత్త:—ఏమి భయపడినట్లు మాటలాడెదవు? క్షణమాత్రమున వారల యమపురమునకుం బంపి గోవుల మరలింపనా.

ఉత్తర:—ఇఁక నాలస్యమేల?

ఉత్త:—సారథి కొఱకు నాలోచించు చున్నవాఁడ. తగిన సారథిలభించెనా (పండ్లు పటపటలాడించి) చిటికెలోఁ గౌరవుల నేమి చేసెదనో.

ఉత్తర:—పూర్వపుసారథి యేమాయె?

ఉత్త:—శౌర్యముండినఁ గదా దేహమూరియున్నని యడుగవలయును. యుద్ధమునకుఁ బోవలసిన యవసరమే మనవగరమున నెవ్వరికిని కలుగ లేదే. మనయూను చచ్చుటయు నిపుడు యుద్ధమను మాట వినుటయు సంభవించినవి.

ఉత్తర:—ఒక్క మాట చెప్పెద. ఆలకించిన మేలు.

ఉత్త:—ఏమామాట.

## ౧౪ పాట.

ఉత్తర:—బృహన్నల సారథ్యమున మిగుల నేర్పరియని సైరంధ్రి ప్రస్తావవశమునఁ దెలుపఁగా విన్నదాన. ఖాండవదహనము మొదలగు కార్యములయం దర్జునునకు బృహన్నల చాల సాయమొనరించి గెలిపించె ననియు విన్నదాన. మీరంగీకరించిన జయము తప్పక గల్గును.

ఉత్త:—(నిట్టూర్పునిగిడించి) అయ్యో! పేడిని జూడనని నిశ్చయించుకొని యుంటిని గదా. రథమున నాకు ముందుఁ గూరుచుండ నేనెట్లు చూతును?

చ. కురుబల మేఁగుదెంచి మన♦గోవుల నొల్లిని బట్టె నంట నే
నరిగి యరాతిసైన్యముల♦నాగ్రని ముట్టఁగఁ బోదు నంట నా
యరదముఁ దోలు నాతఁడు బృ♦హన్నలయే యగు నేని నవ్వరే
పురజను లొక్క సారథియుఁ♦బుట్టఁడొకో మన వీట నక్కటా. 2

ఉత్త:—(వినయము తోఁప).

చ. జగములు మూఁడు నొక్క తటి♦ సత్వముఁ జూపఁగ నెత్తి వచ్చినన్
జగడమునన్ బృహన్నలయె♦ స్యందనమందుఁ జెలంగు నేని గె
ల్వఁగఁ దగు నంచు నింటి మును♦ ప్రాకృత కర్మఫలాంగ సంయుతిం
డగినదియౌ వికారమును♦ దాల్చిన మాత్రనె పెంపు దప్పునే. 3

ఉత్త:—(శిరఃకంప మొనర్చి) సరే. సారథి వేఱొకండు లేఁడు గాన నంగీకరించితి. నీకు విద్యాగురువు గాన బృహన్నలం బిల్వఁ బంపుము.

ఉత్త:—నేనే పిల్చుకొని వచ్చెద.

(అని నిష్క్రమించి బృహన్నలతో వచ్చును)

ఉత్తర:—అన్నా! బృహన్నల సారథ్యము చేయ నంగీకరించెను. నీవిఁక సంగరరంగమున జయము నొందుట యబ్బురము కాదు.

బృహ:—(వినయమ్ముతో నిలుచుండియుండును)

ఉత్త:—బృహన్నలా! ఖాండవదహనంబు చేయు తఱి నర్జునునకు నీవు సారథివై జయముఁ జేకూర్చినట్లు నాకు సారథివై గెల్పు నాకుం గల్గింపుము. వేఱొకమాట యనకుము.

బృహ:—యువరాజా! నాట్యవిద్య నేర్పుచుంటిని. పూర్వపు చాతుర్య మిప్పు డుం డునో లేదో అయినను నేర్పుకొలఁది మీకుఁ దోఁడుపడియెద. కౌరవసైన్యముల గెల్చుటొక గొప్పకార్యమా.

## ౧౫ పాట.

ఉత్త:—ఇప్పటి కదియే గొప్పకార్యమని భావింపవలయు. రథము సిద్ధపఱుపుము. ఆలస్యము చేసిన గోవులు దొరకు టరిది.

బృహ:—(చిటికెలో రథము సిద్ధముచేసి) యువరాజా లేరమ్ము.

ఉత్త:—(అరదమును జూచి) అహా! సకలపరికరములు సిద్ధముచేయఁబడి యున్నవి. గెల్పుగల్గుట నిస్సంశయము. (రథ మెక్కఁబోవును)

ఉత్త:—అన్నా! కౌరవులను గెల్చి వారివస్త్రములలో వివిధవర్ణములు గలవి బొమ్మ పొత్తికలకుం దేవలయు.

బృహ:—కన్యకామణీ! ఈకార్యము నాలోఁ జెప్పఁదగినది. జయమంది తప్పక నేఁ దెచ్చి నీకిచ్చెద. సంశయ మొందకు.

ఉత్త:—(రథ మెక్కి) సోదరీ! ఇదె విజయంబు పొంది వచ్చెద. నిశ్చింతవై యుండుము.

బృహ:—(రథము గడపును? పురముదాఁటి యరదము కొంతదవ్వు పోవును)

ఉత్త:—(రథవేగమును బరికించి ఆశ్చర్యముతోఁ దనలో) అహా! ఏమి సారథ్యము. మిక్కిలి యచ్చెరువుగా నున్నది. అర్జునునకు సారథి యీతఁడని సోదరీమణి చెప్పె. నిశ్చయమే. లేకున్న నిట్టి చమత్కృతి యెట్లు కల్గును. సెబాసు! జయము నాకింకఁ గరతలామలకమే. (ప్రకాశము) బృహన్నలా! రథవేగము సంతోషదాయకముగా నున్నది. గెలుపుకూడ సిద్ధమనియే తోఁచుచున్నది.

బృహ:—యువరాజా ధీరుండవు నీవు రథికుఁడవై నిలిచిన జయమున కొక సందియమా.

ఉత్త:—రథికుఁడవై నిల్చిన అంటివి. ఏమి దీనిభావము.

బృహ:—(సంతోషముతో) రాజకుమారా! మరేమియుఁ గాదు. ప్రతాప మీపఱ కెన్నఁడు మించిన వాఁడఁ గానని యన్నట్లు వినియున్నవాఁడఁ గావున ఘోర సంగ్రామరంగంబున విసుగు చెందక నిల్చిన జయమున కేమి శంక యంటిని.

ఉత్త:—కౌరవులఁ జూచియే భయపడుదు ననుకొంటివా. దేవదానవు లొక్కటియై యెత్తివచ్చినను జంకను జుమీ. ముందు నీవే నాశక్తిని జూతువు గదా.

బృహ:—(చిఱునవ్వుతో) సంతోషము. సంతోషము. నేనే చూడఁ గలను. శరాసనమును సజ్యము గావించి శరంబులం గూర్చి యుంచుము. సంగర మాసన్నముగ నున్నదికదా.

ఉత్త:—సంగరమే కల్గునో నారాఁ గాంచి గోవుల విడిచి కౌరవులు పరుగెత్తిపోవుదురో మనమిప్పు డెట్లు నిశ్చయింపఁ గలము ?

బృహ:—సంగరము పొసంగునని యే శకునములు చెప్పుచున్నవి.

ఉత్త:—బృహన్నలా ! అరదము త్వరగా నడపుము. ముందు గోధనమును మరలింప వలయును.

బృహ:—శూరాగ్రణీ ! యిదే రథము నడపుచున్నవాఁడ.

ఉత్త:—(దృష్టిసారించి) సారథీ ! మనము చాలదూరము వచ్చితిమి కదా.

బృహ:—చాలదూరమా. ఇది. అదిగో మనపురము చెంతనే యున్నదే.

ఉత్త:—బృహన్నలా ! భూమ్యాకాశములకు నిడుము లేకుండ గోడపెట్టిన ట్లున్నదే. ఏమది ?

బృహ:—మహారాజకుమారా ! అది గోధనము ముందిడుకొని పోవుచున్న కౌరవబలము. గోవుల పాదధూళియు, సైనికుల పదధూళియు నట్లగపడుచున్నది.

ఉత్త:—(తడఁబడు మాటలతో) అదిధూళియా. ఏనో యొకయారాము మనుకొంటిని. సరే. దాని చెంతనే పర్వతములపిండునలె నగపడుచున్నవే. వాని వృత్తాంతమేమి ?

బృహ:—(ఆత్మగతము) అప్పుడే యీతఁడు దిగులు పడినట్లు తోఁచుచున్నది. ముందేమి చేయునో. (ప్రకాశము) శూరశిఖామణీ ! అవి మత్తమాతంగంబులు గాని కొండల పిండువులు కావు. వాని జోలి మనకేల ?

ఉత్త:—అవి యేల పోవుచున్నవి ?

బృహ:—చతురంగబలము అనఁగా కరిహయ రథపదాతులని గదా యర్థము. యుద్ధమునకు సిద్ధపడుము.

ఉత్త:—బృహన్నలా ! అవ్వైపున క్రొక్కారు మెఱుపులవలెఁ దళతల లాడుచున్నవే. చూడుము. వాని విషయమేమి ?

బృహ:—అవియే దుర్వారగర్వాంధులగు కౌరవవీరభట సముద్భట శస్త్రాస్త్రముల నిగనిగలు వాని వర్ణన మిప్పుడేల ? ఏమి భయపడినట్లు మాటలాడెదవు !

ఉత్త:—భయమా ! ఎవరికి ? క్రొత్తగా నున్న నడిగితిని.

బృహ:—(రథము నడపుచుండును)

ఉత్త:—సారథీ ! అరదమును వేగముగా నడపకుమా మెల్లగా నడపుము

బృహ:—కాలక్షేపము చేసితిమేని గోధనము మనకు దక్కునా.

ఉత్త:—గోధనము పోదులే. ముందు వెనుక లాలోచించుకొనవలదా.

బృహ:—ఆలోచించియే వచ్చితిమి. ఇపు డాలోచింపఁ దగిన దెవ్వరెవ్వరి కెట్లెట్లు జయింతమనియే కదా.

ఉత్త:—ఏమి బృహన్నలా! నామాట దాఁటి త్వరగా రథము తోలు చున్నావే? కొంచెము నిల్పుము.

బృహ:—యుద్ధము కాఁబోవు తఱి రథము నిలుపుట సారథికిఁ దగిన పనికాదు.

ఉత్త:—సారథీ! రథికుఁడు చెప్పినట్లు చేయుట కదా సారథిపని?

బృహ:—నిశ్చయమే కాని తడవు సేసిన వైరులు దూర మరుగుదురు. కార్యము చెడును.

ఉత్త:—అంత పోయిన పోనీ! పరుగెత్తు వారిని దఱుముకొని పోవుట వీరధర్మమా.

బృహ:—యుద్ధము చేసి గోవుల మరలించిన తర్వాత వారు సంగరము చేయఁజాలక పరుగిడు తఱి వెను దగులరాదు అమాట లిప్పుడేనా.

ఉత్త:—పరుగెత్తినట్టే యనుకొందము. ధీరులైన మనలఁ జూచి నిలువఁబడకుందురా.

బృహ:—అనుకొందమనుట పాడియా. గోధనము మరలించిన తర్వాతఁ జెప్పఁ దగు మాట లిప్పుడే ఏల?

ఉత్త:—(ముందు చూచి) బృహన్నలా! రథము నిల్పుము. పొడవుగా నెగురుచున్నట్లున్నవే వాని వార్తయేమి?

బృహ:—అవియే కేతనపటములు, అవి కూరులగు ధార్తరాష్ట్రుల బిరుదములు. వానిం బడఁ గొట్టి జయమందుము.

ఉత్త:—ధార్తరాష్ట్రు లంటివే. అదేమి? వచ్చిన వారు సైనికులు కదా.

బృహ:—నిశ్చయమే. సైనికులును రథికులును వచ్చియుందురు.

ఉత్త:—సారథీ! మాటల సందడిలో రథము గడపుచున్నావేల? నిల్పుము.

బృహ:—ఎందులకు?

ఉత్త:—ఏతిట్టు చూచినను నాక నేక దుశ్శకునము లగుచున్నవి. అంతియకాక వచ్చుతఱి మాతల్లి గారికి నమస్కరించి యాశీర్వాదము లంది రాలేను. కాన మరల నింటి వఱకుఁ బోయివత్తము.

బృహ:—రథమును మరలించిన నవ్వరా. అది మగతనమా? ధీరులు మెత్తురా?

ఉత్త:—సారథీ! సేరు రాజునకు మఱుగుబం టన్నమాట నిశ్చయమైన ట్లున్నదే. నామాట వినుచు రాదేదవేల! రథము నిల్పుము. అవసరపడక యాలోచింపకొన వలదా.

బృహ.—సారథికృత్య మిట్టి మహాహావసమయమునఁ గాలము వృథచేయక యరినికరములఁ గెల్చునట్లు రథము గడపుట. కాఁబట్టి నాకృత్యమును జక్కఁగాఁ జేయుచున్నాఁడను.

ఉత్త:—(పెదవులు తడపుచు) బృహన్నలా. చీమల పుట్టలు పగిలినట్లు, నేల యీనినట్లు సందు లేక గుఱుతింప నలవిగాక పోవుచున్నదే. అదేదో?

బృహ:—వారే దుర్యోధనుని సైనికవీరులు.

## ౧౬ పాట

ఉత్త:—(చక్కఁగాఁ జూచి వడఁకుచు) సారథీ' రథము క్షణము నిల్పుమా. మఱింత దగ్గరకు నడుపకుము. వారికిఁ జాలదూరముననే నిల్పుము

బృహ:—రాజకుమారా. ఈమాటలలోనే కాలము గడచుచున్నదే. ఎప్పుడు గోవుల మరలింత మనుకొను చున్నావు.

ఉత్త:—(కంపముతో) గోవులమాట యెవరికిఁ గావలెనయ్యా'

బృహ:—మనము వచ్చిన దెందులకు?

ఉత్త:—వచ్చినదా. ఇచ్చటి విషయములు చూచి పోయి తగుసన్నాహముతో మరల వచ్చుటకు.

బృహ:—అంతదనుక గోవు లిందుండునా?

ఉత్త:—అవిషయము నీకెందుకయ్యా. ఉడుతకు ఊరిలోని పెత్తన మేల యన్నట్లు సారథి కేలయ్యా యీ ప్రసంగము.

బృహ:—సారథిని మాత్రమే గాక నిన్ను గెలిపింతు నంటినే. అందుల కీ ప్రసంగములఁ జేయుచున్నవాఁడ. నలుగురి ముందఱఁ బౌరుషములు పలికి కార్యముతటి మగటిమిఁ జూపకున్న క్షత్రియవీరులు నిందింతురు. నవ్వుదురు. ఏవగింతురు.

ఉత్త:—బృహన్నలా' ఇతరు లేమనుకొందురో యని యగ్గిలో దుముకుదురా. ఏటిలోఁ బడుదురా.

బృహ:—అంతటి పని యిపు డేమి వచ్చినది(అనినవ్వును)

ఉత్త:—కినవ్వు నష్టమైపోను' మీఁది ప్రాణములు మీఁదికే పోవుచుండఁగా నన్నుఁ జూచి నవ్వుచున్నావేమి బృహన్నలా? కపటాత్మకా.

చ. అకులగు ధార్తరాష్ట్రులు సుహాకపటాత్ముని నిన్నుఁ బంపి మా
పురమునఁ గల్గు వార్తలను బూసలఁ గూర్చిన రీతిఁ దెల్పి భూ
వరునిఁ దదీయపుత్రకునెుపంబున నూరు వెకల్చి తెమ్ము స
త్వరముగ నంచుఁ బంపిరొకొ తత్త్వము తెల్పుమ నీకు మ్రొక్కెదన్.

బృహ:—రాజకుమారకా! ఇది హాస్యముచేయుటకు సమయము గాదు. విల్లంది భూరి పరాక్రమము చూపుటకిది యదను.

ఉత్త:—నామాటలు హాస్యోక్తులా. ఏమి బృహన్నలా! ఇంత మోసముచేసితివి? మునీ మునీ నవ్వులతోనే నాకొంప ముంప నున్నావే. మాతండ్రికి గారాబు నూనుఁడ నయ్యా? ప్రాణదానము చేయుము. నీమేలు జన్మాంతరమునందుఁ గూడ మఱువను. నా తల్లి తోడు. నమ్ముము.

బృహ:—యువరాజా! భయపడినట్లు నటించి నా తెలివితేటలు పరీక్షించు చున్నారా రేమి? లేకున్నఁ బురమునఁ బల్కిన పలుకులేమి? ఇపుడు చేయుచున్న కార్యమేమి? సంబంధము లేదే. ఏల భయపడియెదవు. ధైర్యమూని నిశాతవిశిఖవరంపరలు ప్రయోగించి ధార్తరాష్ట్రుల యాటోపంబు మాన్చి గోవులతో నగరంబునకుం బోయి జననీజనక సోదరీమణులకుఁ బ్రియంబు చేయుమా. బృహన్నల సారథియై జయము సమకూర్చె నన్న పేరు నిల్పుమా. భయపడకుము. భయపడకుము.

( నేపథ్యమున శంఖారావములు)

ఉత్త:—(అదరిపడి) సారథీ! అధ్వాను లెచ్చటివి? ప్రళయకాలపర్జన్యగర్జారవంబులంబోలి గుండె లవియించుచున్నవే. (అని పడఁకును)

బృహ:—(నవ్వుచు) విరాటప్రియనందనా. అధ్వానులు వైరివీరులశంఖకాహళాది ధ్వానములు. ఇంతమాత్రమునకే భీతిల్లిన శత్రులు చుట్టుముట్టినతఱి, నిశాత సాయకాసారము పైఁబడు సమయమున, శూలముసలపరశుపట్టిసాదినానావిధ భీకరాయుధముల పోటులు శరీరమ్మున నాటుకాలంబున నెట్లు ధీరుఁడవై నిలువఁ గలవు?

ఉత్త:—సారథీ! నీకు వేయి కోట్ల నమస్కారము లర్పించెద. నిజము చెప్పెదవినుము. గోమునఁ బెరిగిన వాఁడనే కాని బాణప్రయోగమున నొక్కపిట్టనైనను గొట్టినవాఁడను గాను. తెలియని వాఁడను. నన్నూరక యేల యేడిపించెదవు. నామాట విని యరదము వేవేగ మరలింపుము. ఊపిరియున్న నుప్పమ్ముకొని బ్రదుకవచ్చు. నాకోమల ప్రాణముల నీభయంకర వైరి దుర్వారాస్త్రముల కర్పింపఁ జాల.

బృహ:—ఉత్తరకుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము. భయము వలదు. నేను నీతోగల నుండ భయమేమి? సురాసురులు నిన్నుఁ గన్నెత్తి చూడఁ గలరే. వినుము నామాట.

సీ. క్షత్రియకులమున • జనియించి భూపతి
తనయుండవై ప్రాయ • మునఁ జెలంగి
శస్త్రాస్త్రముఖబహు • సాధనముల నొప్పి
సంగ్రామ మొనరించు • చంద మెఱిఁగి
బాహుబలంబున • భాసిల్లి యందఱి
ముందఱఁ బౌరుష • ములు పచరించి
వైరుల నని గెల్చి • వారి వస్త్రంబులు
తెచ్చి యిచ్చెద నని • నచ్చ బలికి

తే. యింత మాత్రంబె కాక న • న్నింతవాని
సారథిగ నొప్పుకొనఁ జేసి • యూరు దాఁటి
వచ్చి వైరులఁ గన్గొని • బిచ్చ వడుచు
మరలి పోయిన నవ్వ రే • తరుణు లైన. 5

కావున రాజకుమారా! ఇంక లేనిపోని మాటలతోఁ గాలమూఁ బుచ్చక ధనుస్సును నవరించి నారి సారించి తీవ్రాస్త్రములం గూర్చి సమాహితుండ వగుము. (అని రథము గడపును).

ఉత్త:—బృహన్నలా! కొంగున నగ్గిని మూటఁ గట్టుకొన్నట్లు కొఱవితో నెత్తి గోకికొనునట్లు. నిన్నేల సారథిగాఁ దెచ్చుకొంటి నయ్యా! అయ్యో! క్షత్రియకులమఁట. రాజపుత్త్రుఁడ నఁట. పౌరుషమఁట. ప్రాణములు పోవుచున్నప్పు డా యీమాటలు. సారథీ! దానములలోఁ బ్రాణదాన మధికఫలప్రదము సుమీ. మున్నే పాప మొనరించితివో యీరూపము వచ్చినది. ఇపుడు నాయూపిరిఁ దీసితివా పైజన్మమున కింకేరూపము వచ్చునో.

బృహ:—ఈరూపము నాకెంత కాలముండునో ముందు నీకే తెలియఁగలదు. ఉత్తరకుమారా! ఏల నిందించుకొనియెదవు. నాకణుమాత్రము భయము గల్గునని తోఁచ లేదు. ధీరుండవు కమ్ము.

ఉత్త:—నీకేల భయము తోఁచును? నా ప్రాణములు పోఁగానే నిన్నెవ్వ రేమనరు. పగవారికిఁ దొలికబళము నేనుగదా కావలయు. బృహన్నలా! ఒక్కమాట చెప్పెద. నీకేమైనఁ గావలసిన నిచ్చెద. నాయూపిరిని మాత్రము తీయు ప్రయత్నమును గావింపకుమా.

బృహ:—నాకుఁ గావలసినది సంగ్రామరంగమున విజయము. వేఱొకటి వలదు వలదు.

(నేపథ్యమున ధూరిధ్వని)

ఉత్త:—బృహన్నలా! అయ్యో! ధ్వనులు మాత్రమే కాక వీరభటులహుంకారములు వినఁబడుచున్నవే. సమీపమునకు రథము గడపితివే. ఇంకేమి గతి? అయ్యో తల్లీ! సుధేష్ణా! నీ కొడు కింక రాఁడని నిశ్చయించుకొమ్ము. బృహన్నల బలవంతముగఁ జంపించెనని యొక్కయేడు పేడ్చి యూరకుండుము. తండ్రీ! నిన్నుఁ జూచు ప్రాప్తము నాకీజన్మమున లేదు. (సారథిం జూచి) బృహన్నలా! కడసారి చూపుగా నా ప్రియురాలి నొక్కసారి చూచివచ్చెద. అవల నీకనీ తీరు నట్లు గొంతుకోయుమా. (అని యేడ్చును)

బృహ:—(గట్టిగా) ఏమి యుత్తరా! అసందర్భముగా మాటలాడుచున్నావు. ఇంటియొద్ద నేమని వచ్చితివో స్మృతికిం దెచ్చుకొమ్ము. వినుమా నాయుపదేశము.

సీ. దుర్వారదోస్సార♦గర్వాంధులై విఱ్ఱ
వీఁగు వైరులఁజూచి♦వెగడు పడకు
క్రొక్కాఱు మెఱపుల♦నిక్కు నుక్కడఁగించు
శస్త్రాస్త్రకోటుల♦సరకుగొనకు
కొండలపిండు నాఁ♦గండుమీఱిన దంతి
బృంహితంబులకును♦భీతిఁ గనకు
ప్రళయవాతోద్ధూత♦రజమునాఁ రేఁగిన
భటపదధూళికి♦భయముగనకు
రాజరత్నతనూభవ♦రమ్యతేజ
రాజవరు లెల్లఁ జూడఁగ న♦రాతు లదర
ఘోరసంగ్రామ మొనరింపు♦వీరు లలరఁ
గాక యున్నను సత్కీర్తి♦గలుగు నెట్లు. 6

ఉత్త:—నీపౌరుషము నేలపాలు గాని కీర్తికాంత యేటఁబడి పోనీ: నన్నుఁ బ్రాణములతో విడువుమా. అంతచాలు నీయుపకారము. బృహన్నలా! ఇదె నమస్కరించుచున్నాఁడ. ఎవ రేమే నననిమ్ము. తలవంచుకొనియెద. వీర నామములలో నాపేరు లేక పోనిమ్ము జనక కోపించును. సారథీ! ప్రాణములు తీపని మున్న చెప్పఁగా వినలేదా. నన్నుఁ బదికాలములు బ్రదుకనిమ్ము. అంత చాలును.

బృహ:—రాజకుమారా! ఏమి యీమాటలు శూరుఁడు యుద్ధరంగమునఁ జెప్పవలసి నదియా. శత్రువులు నిన్నుఁ జూచి సంగరమునకు సంసిద్ధులగుచుండ నీవిట్టి నీరసపుమాటలు పల్కుట న్యాయమా. తండ్రి తాతల గౌరవము నాలో

చింపుము. దేహమే స్థిరముగాదు. శాశ్వతకీర్తికి భంగము గలుగునట్లు జీవింప నేల? ఇఁక మాటలుచాలు. రణక్రియకుం బూనుము.

(నేపథ్యమున శంఖకాహళాదులధ్వని)

ఉత్త:—(మోము వెలవెలఁ బాఱ) బృహన్నలా! నాపాలిటికి నీవే యముఁడవు. ఇంకను యుద్ధమునకు వచ్చిన నా ప్రాణములు పోవుచున్నవని మొఱ్ఱోయన్న నాల [illegible] అంపముతోఁ దల [illegible] [illegible] మాట. (అని కోదండమును బాఱవైచి రథము [illegible]

బృహ:—(నలో) ఇఁక [illegible] చేయఁజాలఁడు. సారథిగానైన నంగీకరించునట్లు చేసి కౌరవుల గర్వ మడంచెద. (అని పగ్గములు నొగల నుంచి కశాభూషితహస్తుఁడై ఉత్తరుని వెంటఁ బరుగిడి సమీపించును.)

ఉత్త:—(తిరిగిచూచి నమస్కరించి) బృహన్నలా! నన్నుఁ బట్టుకొనకుమా. మాతల్లిదండ్రులను భార్యను జూచిన తర్వాత వాడికైతో గొంతు కోయుము.

## ౧౭ పాట.

బృహ:—(పరుషముగా) ఉత్తరకుమారకా! పగవారు నవ్వ నీవిట్లు పరుగెత్తిన నేనే మందును? నన్నేల సారథ్యమునకుం బిల్చితివి? ఇంతవఱ కిసుమంతయు నవమానము నొందక యిపుడు నీవలన నవమాన మొందవలయునా? రారమ్ము. రథ మెక్కుము. నేను రథముపై నుండ నీకేమిభయము. కౌరవులుకాదు. ముప్పది మూడుకోట్ల దేవతలు వచ్చినను ఒక్కబాణమైనను నీమేను నంటనిత్తునా (అని పట్టుకొనును.)

ఉత్త:—బృహన్నలా! నామాట వినుము.

చ. శతములు హేమనిష్కములు♦చక్కని రత్నము లొక్కవేయి యు
న్నతహయరత్నముల్ శతము♦నాగము లొక్క సహస్ర మిచ్చి యూ
యతసుఖసంపదల్ వెలయు♦ నట్టిపురంబులు నాలుగిత్తు నే
వితమున నైన నింటికిని♦వేగను పోవఁగ నిచ్చి నంతటన్.

ఇంతమాత్రమే కాదు. ఇల్లు చూడనిమ్ము. నీ కేమేమి బహుమాన మిచ్చెదనో ఇవు డెందుల కామాటలు. (అని చెవిలో నేమోచెప్పును.)

బృహ:—(బలవంతముగ నుత్తరు నెత్తికొని వచ్చి రథము చెంత నిల్పి). రాజకుమారకా!

చ. అరదము నెక్కవయ్య మది♦యందు భయంబును వీడవయ్య సం
గర మొనరింపఁ జాలనని♦క్రమ్మఱఁ దోఁచినఁ దేరుఁ దోలు మా
యరిబల మెల్ల బెండువడ♦నాకురురాజును సిగ్గు నొంద ని
ర్జరులు బళీ యనంగ రణ♦రంగమునం దొకయాట నాడెదఁ. 8

క. అందులకో యిందులకో
సందియమేమియును లేక ♦ సత్వరముగ నీ
డెందమున నెంచి యొడఁబడు
మందమతిం బాఱిపోవు♦మాట విడువుమీ. 9

ఉత్త:—(ఊరకుండును)

బృహ:—(నాగలపైఁ గూరుచుండఁ జేసి) ఉత్తరకుమారా! అల్లదె మఱ్ఱివృక్షంబు కానవచ్చెడిని. అచ్చటికి రథమున్ దోలుము.

ఉత్త:—(విసుగుకొనుచు రథము గడపును)

బృహ:—రాజకుమారా! మఱ్ఱిచెట్టెక్కి యా కొమ్మకుం గట్టిపెట్టిన మూఁటను దెమ్ము.

ఉత్త:—(చూడ్కి నిగుడించి) బృహన్నలా! నేనెంత పనికిమాలినవాఁడ నైనను నన్నింత నీచపుఁ గార్యమునకు నియోగించుట న్యాయమా! క్షత్రియుఁడను గదా శవమును ముట్టఁ దగునా?

బృహ:—యువరాజా! శవమే యైన నీకీపని చెప్పుదునా! ఇతరులు తాకకుండుటకై యీరూపముగఁ గట్టిన శస్త్రాస్త్రములు గాని శవముకాదు. సంశయ మొందకుము.

ఉత్త:—(చేయునది లేక చెట్టెక్కి నిలువఁబడును.)

బృహ:—వేవేగ మూఁడవిచ్చి గాండీవమును చాపంబు నాకందిమ్ము. అదికాని నాబాహువుల యాటోపంబున కాగదు.

ఉత్త.—బృహన్నలా! ఇందు గాండీవ మున్నదియా. (అని మూఁడవిచ్చి యదరిపడి) సారథీ! సారథీ! అయ్యో! గాండీవ మిందున్నదని మోసము చేసితివే. ఇందున్నది కొండచిలువలు సుమీ. వీనిచేఁ గఱపించుటకుం బూనితివా. దీనికన్న నందే గొంతు గోసియున్న మేలుగా నుండునే. నీకోరిక నెఱవేఱియుండును గదా.

బృహ:—భయపడకుము. అవి గాండీవము మొదలగు దివ్యకోదండములు. నిశ్చయము త్వరగఁ దెమ్ము.

ఉత్త:—సారథీ! ఇది యొక కొండచిలువవలెఁ జెలువారుచు సులలితరత్నఖచితమై

కనకకమలాలంకృతంబై యున్నయది. ఎవరి దీచాపము? తక్కిన వెవ్వరెవ్వరివి? నిరూపింపుమా.

బృహ:—తొలుదొలుత నీవడిగినది గాండీవము. అది యర్జునుని హస్తమునకే యలంకారము. దాననే యతండనేకవీరులను గెల్చి దేవదానవులు మెచ్చం బ్రవర్తిల్లెను. నీలోత్పలములవలెఁ దేజరిల్లి కనకకింకిణీమండితంబైన చాపంబు ధర్మరాజుది. తాళప్రమాణమునం దగి బంగారుశాఖలచే విలసిల్లు కోదండము భీమునిది. ప్రజ్వలజ్వలనాకృతిగల కనకమత్స్యసమంచితశరాసనంబు నకులునిది. మనోహరంబై కాంచనమయూరాలంకృతంబగు ధనుస్సు సహదేవునిది. వృషభచర్మము చుట్టినదియే గాండీవము, దానినే తెమ్ము.

ఉత్త:—బృహన్నలా! ఈదివ్యాయుధంబుల నిందుఁ బెట్టి పాండవు లెందేగిరో వారి యుదంతంబు తెలిసియున్నఁ జెప్పుమా. వారికి నేమనల్లుఁడను.

బృహ:—వారెల్ల మనవీట నజ్ఞాతవ్రతం బూనియున్నవారు.

ఉత్త:—బృహన్నలా! మనవీట నున్నారా, ఎవరు వారు?

బృహ:—యువరాజా! వినుము.

సీ. కంకభట్టను పేరుఁ గాంచి మీతండ్రికిఁ
దమిఁ గూర్చునాతండె ధర్మజుండు
వలలుఁడన్ పేరున వర్తించి కీచకు
లను జంపినాతండె యనిలసుతుండు
అశ్వశిక్షకుఁడయి యలరి దామగ్రంధి
నామంబు గలవాఁడె నకులుఁ డగును
ధేనురక్షకుఁడు తంత్రీపాలుఁ డన నొప్పు
పావనుండే సహదేవుఁ డగును

తే. మానినీనామమున నొప్పు మహితశీల
ద్రౌపది యటంచు నెఱుఁగుము భూపతనయ
యింక దాఁపంగ నేమగు నేనె యర్జు
నుండ వేగంబ తెమ్ము కోదండ మిటకు. 10

ఉత్త:—(ఆనందపరవశుండై మ్రానుడిగ్గి నుతికి నమస్కరించి) మహాత్మా! నేఁటికి నాజన్మము పవిత్రమాయె. సఫలమనోరథుఁడనైతి. తెలియక నాచేసిన సకలాపరాధంబులు క్షమింపవలయు. గర్వంబుచేఁ గాని, కోపముచేఁగాని నాయాడిన మాటలు సహింపవలయు. (అని చేతులొగ్గి ప్రార్థించును.)

బృహ:—యువరాజా! మీయాశ్రయమున సుఖముగాఁ గాలము గడపితిమి. ఏకష్టములు లేక యుంటిమి. ఇట్టి మహోపకారులగు మీకు మేము కృతజ్ఞులము. సారథ్యము చేయునప్పుడు నేను నిన్నాడిన మాటలకు మనస్సున నేమియు ననుకొనవలదని నేనే వేడుకొనవలయును, నాయనా! చిన్నవాఁడవు. కాన నిన్ను మిక్కిలి ప్రార్థింపరాదు. నామనస్సునఁ గ్రోధ మేమాత్రము లేదు. నీవు నన్నే ప్రసన్నస్వాంతుఁడవుకమ్ము.

ఉత్త:—[1]కృతార్థుఁడ నైతిని. మహాత్మా! మీ చెలిమియు సమకూడె. రణరంగమున మీకు సారథి యగునంత భాగ్యము నాకుం గలిగెను. ఇంతకన్న నాకేమి కావలయు

బృహ:—ఉత్తరకుమారా! తక్కిన దివ్యాయుధముల నెప్పటియట్ల కట్టిపెట్టి రమ్ము. కురుబలములు మనలం జూచుచున్నవి. వానిమార్కొని నిల్పుకున్న గోధనము మనకుం దక్కదు. కౌరవవీరుల నుక్కడంచెద. చేతులతోఁట పోవ లేఁటాడవలదా.

ఉత్త:—అట్లే చేసెద. ఇంక రథమెక్కుదము.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది షష్ఠాంకము.

---

1 అద్భుతప్రాప్తిరూప మగుట నిది యుపగూహనము.

# సప్తమాంకము.



(పిదప అతిరథ సుకేతనులను గంధర్వులు ప్రవేశించుచున్నారు)

అతిర:—సుకేతనా! ఇంద్రుని యానతి యెఱుఁగుదువు కదా! వచ్చినపనిన్విమర్శించి తెలిసికొని త్వరగా నీవార్తల నింద్రునకుం దెల్పవలదా.

సుకే:—అతిరథా! నిశ్చయమే. నేను నాపని నిర్వహించి వచ్చితి. నీపని యెంత మాత్రమైనది?

అతిర:—నీవు విమర్శించివచ్చినపనియేదిఁ తెల్పుము.

సుకే:—దక్షిణగోగ్రహణము సుశర్మ జరపఁగా విరాటుఁడు యుద్ధమునకుం బోవుచుఁ ధర్మజభీమనకులసహదేవులను బిల్చుకొని పోయెను. విరాటునకు బ్రాణాంతము కలుగునంతటి విపత్తు సుశర్మ యొనఁగూర్ప భీమాగులు అవిపత్తును దప్పించి సుశర్మను బంధించిరి. ధర్మరాజు కృపాయత్తమతి గావున వాతని విడిపించెను. సుఖముగా నందఱు పురము ప్రవేశించుచున్నారు.

అతిర:—సంతోషమే గాని విరాటునకుఁ దనకు సాయముచేసిన వారు పాండవులని తెలిసినదా.

సుకే:—లేదు లేదు. ఇంకను అతఁడు తెలిసికొనలేదు.

అతిర:—చాల సంతోషవార్త తెలిపితివి. పాండవుల గుట్టు ఇంకను దెలియకుండుట యుత్తమము.

సుకే:—ఇంక నీవరసివ వృత్తాంత మేది?

అతిర:—మిత్రుఁడా! విను. దుర్యోధనాదు లుత్తరమున గోవుల నరికట్టిరి. అవార్త తెలియఁగనే యుత్తరుఁడు బృహన్నల సారథిగాఁ జేసికొని యుద్ధమునకు వచ్చి కౌరవులను జూచి భయము చెంది పరుగెత్తెను. బృహన్నల యాతనిం బట్టి తెచ్చి సారథిగఁ జేసికొని శమీవృక్షమునఁ దమకట్టినయాయుధంబులదింపించి తమగుట్టు వానికిం దెలిపి కౌరవులపైఁ గవిసెను. బృహన్నల యర్జునుఁడే యయ్యోనేని మరల నడవులకుం బోవలని వచ్చువని దుర్యోధనుం డాక్షేపింప భీష్మద్రోణు లాశంక మాన్పిరి. అర్జునుఁడు ద్రోణాదివీరుల మార్గానఁ బోవుచున్నాఁడు. అవిషయమును జూచి పోయి యింద్రునకుం దెల్పుదము రా.

(అని నిష్క్రమింతురు.)

(దుర్యోధన కర్ణ శకుని భీష్మ ద్రోణ కృపాశ్వత్థామాదిమహారథికులు ప్రవేశింతురు.)

దుర్యో:—వీరులారా! అర్జునుఁడు వచ్చువాఁడని నిశ్చయమాయెఁగదా. పదుమూఁడు సంవత్సరములును నిండెననియుఁ గూడ నిర్ధారణము భీష్మద్రోణులచేఁ జేయఁబడెను. ఇంక యుద్ధమునకు సిద్ధపడి తగిన పద్ధతిని నడుపుఁడు.

ద్రోణా:—మహారాజా! మన కిది యుద్ధము చేయు తరుణము కాదు. దేవేంద్రశంకరాదుల మెప్పించి సకలదివ్యాస్త్రములం బడసి తేజరిల్లుచున్నవాఁడు. యుద్ధము లేమిఁ దీఁటఁ బట్టిన చేతులతోఁ గలిగియున్నవాఁడు. మన మెల్ల నాతనికిం దోలిముద్ద యగుదుము. అతని మార్కొని నిల్వ మనకిప్పు డసాధ్యము. నేఁడాతని యుత్సాహముం జూడ సురాసురులు మార్కొన్నను జయింపలేరని తోఁచుచున్నది. నామాటలం బాటించి గోవుల విడిచి మనము పురికరుగుట యుక్తము. ఇదియే నాభావము.

కర్ణు:—(పకపక నవ్వుచు) రాజకంఠీరవా! ముదుసళ్లను సంగరమునకుఁ బిల్చుకొని రావలదని నెత్తిన నోరుపెట్టుకొని మందలించితి. నామాటలం బాటింపక వీరిం గొనివచ్చితివి. చూచితివా ప్రతిక్షణము నశుభములు పల్కుచున్నవారే కాని మనకు శుభముత్సాహమును గల్గున ట్లొక్కమాటయైనను బల్కరు. అర్జునుఁడఁట. మనల జయించునఁట. దివ్యాస్త్రములఁ బడసినాఁడఁట. వీరిఁబోలి మన కేల? నేనొక్కఁ డాయితంబుగా దుర మొనర్చెద. గాండీవము గిండీవము పాశుపతము గీశుపతము ఏమైపోవునో చూతువుగదా.

అశ్వత్థామ:—కర్ణా! నిశ్చయము నీవంతవాఁడవే. ద్రౌపదీస్వయంవరము నందు నీకోడిగదా యింతకాల మర్జునుఁ డడవుల దాగియుండెను. సిగ్గులేక నేఁడు తల యెత్తుకొని మరల వచ్చినాఁడు. ఘోషయాత్రలో గంధర్వులు రాజును బంధింప నీవే కదా విడిపించితివి? సెబాసు! నీవే శూరశిఖామణివి. నీవే మేటి పరాక్రమధనుఁడవు. నిన్ను నమ్మి కదా రాజు పాండవులతోఁ బగగొనుట. తులువా! సిగ్గులేక యింకను ప్రేలెదవా? పండ్లూడఁ దన్నువారు లేరనికదా నీవిట్లు కూయుట. ఆపని యిఁకఁ గొలఁది ముహూర్తములలో నర్జునుఁడే నిర్వహించును. పాలవంటి కౌరవకులమును నశింపఁజేయఁ బుట్టితివి. ఆనాఁడు సభలో ద్రౌపదీమానభంగసమయమునఁ గావలసిన కార్యములన్నియు నిపుడగును. త్వరపడకుము. అర్జును నొక్కడంతువుగా. పలుగాకీ! నీవు కాదు, త్రిజగంబు లొక్కటియై వచ్చిన ముహూర్తమాత్రము నిల్వఁ గలుగునా. వారుని యుద్ధ

పడికిఁ బయిగిడక నిల్చి పెంచిన నాతని మార్కొనిన వీరుఁడు నిరయోధుల నిల్వఁ జాలఁడు గా.

కృపుఁడు:—(మాటకడ్డమువచ్చి) కర్ణా! అశ్వత్థామ పిన్నవాఁడు. చక్కఁగా మాట లాడఁ జాలఁడు. మేము ముసల్లము. యుద్ధశూరులము గాము. నేఁడు శకుని యును నీవును మార్కొని యర్జునునిల్పుము. పరమానందము నొందెదము. (పండ్లు పటపట గొఱికి) కులపాంసనా! నీవలనఁ గదా కౌరవులు నామావశిష్టు లయ్యెదరు. ఎన్నికుటుంబములో యుద్ధమునఁ గూలనున్నవి. నీ ప్రతాపము మాత్ర మసమానమని త్రిలోకము లెఱుఁగును. మేము చెప్పిన నేమిలాభము ముదుసళ్ల మని మమ్మాక్షేపించితివి. నవవయస్స్ఫురితుండవగు నీవే యిపుడు యుద్ధమొన రింపుము. మేమూరక చూచుచుండెదము. అర్జునుని బాణములు నీయంగముల బ్రద్దలు చేయుచుండఁ గన్నులారఁ గాంచుచుండెదము. ఒక్కయర్జునుఁడే నేఁడు వచ్చుచున్నాఁడు. వీనింజంపితివా మనరారాజునకు రాజ్యము దక్కును. అంతమాత్రము నేఁడు చేయుము.

శకుఁడు:—రాజరాజా! నోటికి వచ్చినట్లు వీరిద్దఱు ప్రేలుచున్నారు. నీవును వింటివి గదా. ఇఁక నేనోర్వఁజాల. చండబాణములఁ బరఁగించి వీరిగుండియ లవియించెద. బ్రాహ్మణులని యింతదూర మోర్చుకొంటిని. వీరి కులంవపల్కులు నాశాంతమును బోగొట్టుచున్నవి.

ద్రోణు:—వీరోత్తమా! కర్ణా! నీవన్నమాట నిశ్చయమే. నీవంతవాఁడవే. నిన్నుఁ బ్రాణబంధువుగా నమ్మియున్న రారాజు కృతకృత్యుఁ డగుసమయము వచ్చినది. మేము విప్రులము. భోజనప్రియులము. యుద్ధము మాట మాకుఁ దెలియదు. శస్త్రాస్త్రములం దీయొద్దనున్నయన్ని మాకడలేవు. కాని మాశిష్యుఁడొక్కఁడే నేఁడు ఇదిగో వచ్చుచున్నాఁడు. నిల్వుము తొలంగిచూచుచుందుము. (కోపముతో) కండగర్వంబున మాగుండియ లవియింతువటే? ఏది యిటు తిరుగుము. శస్త్రాస్త్రపాటవంబే పాటిదో లక్ష్యశుద్ధి యెంతమాత్రమో కొంచెము చూచెద. అర్జునుఁడు వచ్చులోపల నిన్ను జక్కఁబెట్టెద.

అశ్వ:—తండ్రీ! మీ రూరకుండుఁడు. ఈ తులువ నడంచుటకు మీరుపూనవలయునా? క్షణమాత్రమున నేన యొక్కడంచెద.

కర్ణు:—మహీపాలకా! ఇంక నేనోర్వఁజాల. ఇదిగో దివ్యాస్త్రములఁ జాపంబున గూర్చుచున్నాఁడ. వీరి యాశ నికింక లేదు.

భీష్ముఁడు:—(పక్కున నవ్వి) తులువా! పలుమాట లాడకు. నోరు మూసికొని యూర కుండుము. ద్రోణకృపాశ్వత్థామలముందఱ నీవెంతవాఁడవురా. వారన్నమాటలు

సత్యములు. నిన్ను నమ్మి రాజు చెడుచున్నాఁడు. చెడును అర్జునమదగజము దుర్యోధనబలకమలాకరంబున విహరించి హాయిగా మరలిపోవఁగలదు. చావఁగా మిగిలిన వారు కరిపురంబున కెంపు మొగములతో నరుగఁగలరు.

కర్ణుఁడు:—(కౌడుకంచి) రాజా! క్షణమాత్రము కూడ నోర్వను. ద్రోణద్రౌణి కృపాచార్యులారా! మీ శిరస్సులు తెగిన నెనుకొనుఁడు. (అని కోదండము లాగును.)

దుర్యో:—(అడ్డముసొచ్చి) కర్ణా! కొంచె మోర్చుకొనుము. ద్రోణాచార్యప్రముఖ శూరులారా! మీరిట్లు కలహించుట న్యాయమా. మనము వచ్చిన పనియేమి? నాపై దయయుంచి యంద ఱేకముఖముగా నొక వ్యూహము దీర్పుఁడు. నన్ను గెలిపింపుఁడు.

ద్రోణుఁడు:—రాజా! నిన్నుఁ జూచి యూరకుందుము. ఓపిన భంగి పోరాడుదుము. చూడు మెవ్వరెవ్వరిశక్తి యెట్టిదో. ఇంక నందఱము ముందు పయనము సాగింపక వెనుక వెంగముగా నిల్చి యుద్ధసన్నద్ధులమై గావలయు.

(అని యందఱు నిష్క్రమింతురు.)

(అర్జునుఁ డుత్తరుఁడు సారథిగా రథమునడుపఁ బ్రవేశించుచున్నాఁడు)

అర్జు:—ఉత్తరకుమారా అల్లవారె కురువీరులు. భీష్మద్రోణాదులం జూడుము. వీరు మహాత్ములు. నాకుం గురువులు. పూజ్యులు. వీరితోఁ దొలుత యుద్ధము సేయరాదు. నిక్కముగ వారలిగిరా జయము సంశయము. అల్లవాఁడె కురురాజు. అరద మచటికిం దోలుము. నీవేమాత్రము భయపడకుము.

ఉత్త:—భయమ్ము సాకా! మనపగవారికి. ఇఁక నీవూరకుండి చూచుచున్న నేనే సంగర మొనరించెద. నీసాయమున్న వీరు నాకింక లెక్కయా.

అర్జు:—(నవ్వి) యువరాజా! అంత కష్టము నీకేల! నేను యుద్ధమొనర్చెద. రథ మతి వేగమున దుర్యోధనుని కడకుం దోలుము. ద్రోణాదులకు నమస్కారబాణములు ప్రయోగించునంతదాఁక మెల్లఁగా నడుపుము.

ఉత్త:—(అట్లే రథమునడపును)

అర్జు:—(భీష్మద్రోణకృపాచార్యులవంకఁ దిరిగి) మహావీరులారా!

చ. కాలము దుష్టమౌట మిముఁ గాంచెను భాగ్యము లేక కానలో
నోలి వసించి యుండి యిటులు గ్రసర వ్రతవత్సరంబు నుం
బాలనచేసి వచ్చితిని బార్థుఁడ శిష్యుఁడ న్యాయరీతి న
న్నేలుఁడు వందనంబు లివియే శరరూపము లందుకోఁ దగున్. 1

(అని బాణముల వైచును)

భీష్మ:—(ద్రోణాగు లానందబాష్పముల విడుతురు)

అర్జు:—(దుర్యోధను సమీపించి చిఱునవ్వుతో)

ఉ. పాడి తొలంగ కిట్లు పలు♦బాములు కోరిచి ధర్మచిత్తుఁడై
యాడనలేని ధర్మసుతు♦డిట్లు వచించిన నట్లె చేయుచుం
గ్రీడయు బోలె సవ్యశపము♦రీతి బ్రతిజ్ఞను దీర్చి నిన్నిటం
జూడఁగ వచ్చినాఁడ నిదె♦సూనుఁడవే రణభిక్ష మీఁదగున్. 2

ఆనాఁడు సత్యపాశబద్ధులమయి యూరకుంటిమి. నీ యిచ్చవచ్చినట్లు పరిహాసించితివి. ద్రౌపది ననరాని మాటలంటివి. చేయరాని యవమానమును జేసితివి. కపటద్యూతంబున నధర్మపద్ధతియే ప్రధానముగాఁగల మార్గంబున మమ్ము గెల్చి యంపితివి. పెట్టరాని కష్టములం బెట్టితివి. అన్నా! ఒక్క మాట వినుము.

సీ. శకుని చేసెడు కను♦సన్నలఁ బాచికల్
దొరలించి రాజ్యంబుఁ♦దోచుకొనుట
దుశ్శాసనుఁడు చేయు♦తులువకార్యంబులఁ
గన్నులారఁగ నీవు♦కాంచుచుంట
కర్ణుఁడు మదిఁ బొంగు♦కౌతుకంబుననాడు
కలుమంపుబల్కులఁ ♦ నెలమివినుట
ప్రేలుగాకులను నమ్మి♦పాండవుల జయింతు
నని యాశ మనమున ♦ యందుగనుట
తే. నేఁటితోఁ జెల్లె నీయాశ♦లేటఁ బడెనొ
మేటిమగఁడవు దుర్మద♦పాటవంబు
గల్గు రాజవు నిలువుమా♦కయ్యమిపుడు
పొసఁగె నాతోడ నింకెందుఁ♦బోవవచ్చు. 3

దుర్యో:—అర్జునా! చిరకాలమునుండి యుద్ధములేక పరితపించు నాకు నేఁడు పండుగు దినము. పౌరుషంబు లేల గాని సంగరమున నీవే తెలిసికొనఁ గలవు. కయ్యమున కాయత్తుఁడవై నిలువుము.

అర్జు:—అన్నా! దుర్యోధనా! యుద్ధములేక యుంటివా. ఘోషయాత్రసమయమున గంధర్వులతో యుద్ధము పొసఁగి నపుడు బాహుపరాక్రమము జూపు సమయము లభింపలేదు కాఁబోలు. గంధర్వు లింతలోనే యోడి పరుగెత్తిరి కాఁబోలు. కర్ణశకునిదుశ్శాసనులు వారిని బాఱఁ దోలిరి కదా. సిగ్గులేక యింకను మాటలాడెదవా. ఇదె నా తీవ్రబాణవిషధరంబులు నీ ప్రాణవాయువులం గ్రోలఁ

గలవు. నీకిపుడు సాయమొనరింపఁగల వారలంబిల్చుకొమ్ము. కడసారి వారితో మాటలాడుము. ఇఁక మరల నీజన్మమున వారలఁ జూడఁజాలవు.

భీష్మద్రోణులు:—విజయా! మమ్ముఁ జులకన చూచి యెందుఁబోటికిఁ బోవఁదగునే. అది వీరధర్మమే. యుద్ధమునకు మేము పిల్చుచున్నవారము. మమ్ముఁ దిరస్కరించి పోవుట నీకు మేలుగాదు.

అర్జు:—ఉత్తరా! గురువులు రమ్మనుచున్నారు. మీఁదు మిక్కిలి దుర్యోధనున కడ్డముగా నిలువఁ బడనున్నారు. వారిం దిరస్కరించితి ననుచున్నారు.

దుర్యోధనుఁ గనఁబడకుండ రథములం దోలించుచున్నారు. రథము వారి కభిముఖముగం ద్రిప్పుము. ఇందె యుండి వారి నివ్వరించెద.

(అని నిష్క్రమింతురు.)

(అతిరథసుకేతను లంబరమున మరలఁ బ్రవేశించుచున్నారు.)

అతి:—మిత్రమా! మన మీసందడిలో నెందెందో చూచుచుంటిమి. అర్జునుఁ డిప్పుడే దుర్యోధనుఁ దలపడ భీష్మద్రోణ కృపకర్ణు లెదురునడిచి మార్కొనఁగా వారి నశ్రమంబున నోడించి దుర్యోధను నలనొప్పించి సమ్మోహనాస్త్రంబు ప్రయోగించి యందఱ మూర్ఛితులను జేసెను. చూడుమా. ఎల్లవారు నిద్ర పోయినట్లు పడుకొని యున్నారు.

సుకే:—వారివస్త్రములఁ గత్తిరించుచున్నాడే, ఎవఁ డాతఁడు?

అతి:—ఎఱుఁగవా! అతఁడే కదా యుత్తరకుమారుఁడు.

సుకే:—అర్జునుఁ డేటికో వెనుకకు లాగుచున్నాఁడే.

అతి:—ఉత్తరుఁడు తెలియక భీష్మునిరథముచెంతకుఁ బోఁ బ్రయత్నింప నామహాత్మునకు సమ్మోహనాస్త్రబాధలేదు కావున నచ్చటికిఁ బోవలదని నివారించి వెనుకకుఁ బిలుచుకొని పోవుచున్నాఁడు.

సుకే:—ఆహా! అప్పుడే యిందఱ నోడించి తలచీరలు గత్తిరించుకొని రథమెక్కి దేవదత్తము పూరించుచు మరలి గోగణంబులం దోలించుకొని పోవుచున్నాఁడు. ఎంతటిసామర్థ్యము.

అతి:—మిత్రమా! మన మీవార్తల వేవేగ దేవేంద్రునకుఁ దెలియఁబఱుపవలయు. పోదము రమ్ము.

(అని నిష్క్రమింతురు.)

(విరాటుఁడు కంకభట్టును బ్రవేశించుచున్నారు.)

విరా:—కంకభట్టూ! విజయమును గాంచి వచ్చితిమి గాన మనము పాచికలాడుదమా.

కంక:—మహీపాలకా! ద్యూతమున నెక్కువ ప్రీతియుంచుట పాడిగాదు. ధర్మరాజు ద్యూతక్రీడవలననే రాజ్యము శత్రువులకిచ్చి యడవులపాలు కావలసిన వాఁడాయె.

విరా:—వినోదమునకై యాడినఁ దప్పుగాదు. అదిగో మనసైరంధ్రి వచ్చుచున్నది. పాచికలం దెమ్మనియెద.

(సైరంధ్రి ప్రవేశించుచున్నది.)

విరా:—సైరంధ్రీ పాచికలం దెచ్చియిమ్ము.

సైరం:—(పాచికలం దెచ్చి ముందిడ చున్నది.)

విరా.—కంకభట్టూ! ఒకయాట యాడుదము.

ధర్మ:—కానిండు. మీయిష్టమును దీర్చుటకంటె శ్రేయస్సెద్ది?

(గోపాలకులు ప్రవేశించుచున్నారు.)

గోపా:—జయము జయము మహారాజు గారికి.

విరా:—ఏమి వార్తలు?

గోపా:—కౌరవుల నోడించి యువరాజుగారు గోవుల మరలించుకొని బృహన్నలతో వచ్చుచున్నారు.

విరా:—(పరమానందముతో) మంత్రీ! ముందు వీరికి బహుమాన మిప్పింపుము.

మంత్రి:—చిత్తము (అని వస్త్రాభరణముల నిప్పించును)

విరా:—కంకభట్టూ! కురువీరుల నెల్ల నోడించి మనయుత్తర కుమారుఁడు గోవుల మరలించుకొని వచ్చుచున్నాఁడట. ఎవ్వరైన నిట్టి పరాక్రమంబు చూపినట్లు వింటిమా. కులోద్ధారకుఁ డిట్టివాఁడు కదా.

కంక:—భీష్మద్రోణద్రోణికృప కర్ణదుర్యోధనాదుల మన యుత్తరుఁడే జయించెనేని దీనికంటె మహోత్సాహకృత్యము మఱిదియుండునా? వీరులలో నుత్తరుఁడే అగ్రేసరుఁడగుఁ గదా.

విరా:—(కటకటంబడి) ఇదేమి యిట్లనుచున్నావు కంకభట్టూ! ఈమాట వలన విజయము సందియమని కదా నీతాత్పర్యము! ఓర్చితిని. రెండవ పర్యాయ మి ట్లాడకుము.

కంక:—

క. కురుబలము మాట యేటికి
సురాసురులు కోట్ల కొలఁదిఁ జేరిత మెఱియం
బరువున రాఁగ బృహన్నల
యరదంబున నుండ గెల్చుట బ్రమె భూపా.

విరా:—(క్రోధముతో) నీవు చెప్పఁగా నిట్టి వింతలు వింటిమి. లోకమున సారథులను జూచితిమి రథికులను జూచితిమి. ఈనాఁటికి సారథుల సాయమునచే రథికులు విజయ మందుట నీవు చెప్పఁగా విన్నారము. నాకుమారుని విజయమున కోర్వక యాడు నీమాటలు చాలు. ఇఁక నూరకుండుము.

కంక:—(నవ్వుచు) మహీపాలకా! బృహన్నల యుద్ధముచేయ వాంఛఁ బూని యుత్తరకుమారుని సారథిగాఁ జేసికొని కౌరవుల నుక్కడించి పసుల మరలించెఁ గాఁబోలు. ఈ నామాట తప్పదు. కొంతసేపటికి నీకె తెలియఁగలదు. వేగంబ బృహన్నల కౌరవుల జయించెనని చాటింపుము.

విరా:—(కోపోద్రేకమున) కంకభట్టూ! వలదన్న మానకొనవా. నాకొడుకు మాట యన్న నీకుఁ దలనొప్పిగా నున్నట్లున్నది. అశుభములు పల్కుచున్నావా. కన్నులు కానరాలేదు కాఁబోలు (అని సారెతోఁ గొట్టును.)

సైరంధ్రి.—(పరుగెత్తివచ్చి పైఁటతో రక్తధారలు క్రిందఁబడకుండ నొత్తును)

విరా:—నీవేల చీరకొంగుతోఁ దుడుచుచున్నదానవు.

## ౧౮ పాట.

సైరంధ్రి:— విమల వంశంబునఁబుట్టి; పుణ్యవర్తనుండై, మహాత్ముఁ డనఁ బ్రఖ్యాతిగాంచు నీసత్యనిరతుని రక్తమెన్ని బిందువులు భూమిపైఁ బడునో యన్నివర్షము లనావృష్టి సంభవించును. అక్కటా! ఇట్టి మహాత్మునకొక యపకారము చేయుట విపత్కారణము.

(ఉత్తరకుమారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ఉత్త:—(తండ్రికి నమస్కరించును.)

విరా:—(ఆనందమునఁ గౌఁగిటం జేర్చి ముచ్చటలాడును)

ఉత్త:—(కంకభట్టు మోమునఁ జిమ్ము రక్తబిందువులఁ జూచి) తండ్రీ! అదేమి? ఈ మహానీయుని మోమున రక్తబిందువులు చిమ్ముచున్నవే? ఏల?

విరా:—కుమారా! నీజయము నోర్వక యీతఁడు బృహన్నలఁ బొగడె. దానఁ గోపించి సారెఁగొని వ్రేసితి.

ఉత్త:—తండ్రీ! మహాపరాధము గావించితిరే. విప్రోత్తము లేమన్నను, వినవలయునే గాని వారిని వారింపఁ దగునా. ఈ పవిత్రచరిత్రునిఁ బ్రార్థింపుఁడు. మనవంశము నిలుచును.

విరా:—(భయభక్తులతో నమస్కరించి) కంకభట్టూ! త్వరపడి తప్పుచేసితిని. మనమునఁ గోప మూనకుమా.

కంక:—మహీపాలకా! నాకు నీపైఁ గోపము గల్గునా. విధివశ మిది? భయపడకుము
(అని చిఱునవ్వు గనఁబఱచును.)

విరా:—కుమారా! యుద్ధవార్తలఁ దెల్పుము. ఎట్లుమార్కొంటివి? ఒక్కరుఁడవే యింతసాహస మెట్టు చేసితివి? విన వేడుకయ్యెడు.

ఉత్త:—తండ్రీ! వినుము.

సీ. కురువీరులను జెండఁ ♦ గోరిక నేగితి
వారిఁ గాంచిన యంత ♦ భయము నొంది
వడవడ వడఁకుచుఁ ♦ బరుగెత్త సాగితి
నంతలో నొక్క మ♦హాత్ముఁ డెలమి
నరుదెంచి నన్ను నా ♦ యరదంబుపై నిల్పి
తా రథికుండయి ♦ వారిఁ దాఁకి
భీష్మాదిరథికుల ♦ పెంపడగించెను
గోవుల మరలించె ♦ గూర్మి నన్నుఁ
గాచి విజయంబుఁ గల్గించెఁ ♦ గౌరవేంద్రుఁ
డేడ్పు మొగమున నింటికి ♦ నేగె; నేను
నమ్మహాధీరు కరుణ జ♦ యంబు నొంది
వచ్చితిని సత్యమియ్యది ♦ వసుమతీంద్ర. 5

విరా:—(సంతోషముతో) ఆమహానుభావుఁ డెవ్వఁడో నేను జూడఁ గోరుచున్నాను.

ఉత్త:—నేఁడో రేపో మీకు నేత్రోత్సవము చేయఁగలఁడు.

విరా:—ఆమహానీయుని జూచినఁ గాని నామనస్సు తృప్తినొందదు. నాయనా! వీర కృత్యమొనరించితివి. సత్కీర్తిం గాంచితివి. వేగంబ తల్లి మనస్సు నానందంబున మునుంగం జేసిరమ్ము.

ఉత్త:—చిత్తము. ఇదె పోయి వచ్చెద.

(అని అందఱు నిష్క్రమింతురు.)

(పిదప ధర్మరాజు విరటుని గద్దియపై నుండ భీమాదులు ప్రవేశించుచున్నారు)

ధర్మ:—సోదరులారా! మనవ్రతముసంపూర్ణమాయెను. ఇఁక మనము విరాటునిమన్నవలం బడక ముందటిప్రయత్నమును జరుపవలయును.

భీమాదులు.—నిశ్చయమే. మాచిత్తవృత్తి మెలఁగువారము. అదె విరాటభూజాని యుత్తరునితో వచ్చుచున్నట్లున్నది.

(ఉత్తరునితో విరాటుఁడు ప్రవేశించును.)

విరా:—(చూడ్కి నిగుడించి సింహాసనముపై నున్న ధర్మరాజుం గాంచి) కోపముతో) ఇదేమి కంకభట్టూ! నా సింహాసనముపైఁ గూరుచుండుటయే గాక నన్నుఁ జూచియైన దిగక యున్నావు? ఇంత యహంకారమేల ?

అర్జు:—(మందహాసము నభినయించి)

చ. వినుము విరాటభూమివర! విక్రమసంపదఁ బెంపు మీఱి శ
త్రునికరభీతిదుం డగుచుఁ దోఁచుచు సూనృతవాదియై సుధ
ర్మను నిజశక్తి నెక్కుడగు రాజిలు ధర్మసుతుం డితండె సు
మ్మనుపమకీర్తిశాలి యితఁ డర్హుఁడు గాఁడొకో దీని నెక్కఁగన్. 6

రాజసూయాధ్వర మొనరించిన మహాపవిత్రశరీరుఁడు, సకలరాజన్యకిరీటఖచితమణిగణ నీరాజితపదారవిందుఁడు (సకలయాచకజనకల్పవృక్షము, చండవైరిసముదయకాలుండు. యశశ్చంద్రచంద్రికాపవిత్రీకృత త్రిలోకుండు ఈతఁడే సుమా.

విరా.—(ముక్కుపై వ్రేలిడుకొని) ఈమహానియుఁడు ధర్మనందనుండగునా. అట్లైన భీమార్జున నకుల సహదేవులును, ద్రౌపదియు నెందున్నవారు?

అర్జు:—బకదానవుం బొలియించి, కిమ్మీరాసురారిం గీటడంచి, ప్రచండదోర్దర్పభయంకరుండగు హిడింబు నామావశిష్టంబు గావించి మల్లుర నెల్లం జెండి పలలాభిధానంబున మీనగరంబున వంటలవాఁడయి దైవవశంబున నున్న నుదారవిక్రముం డరాతిలయకాలుండు భీముం డీతఁడే యని యెఱుంగుమా. విరాటభూమిపాలకా! ఈతఁ డశ్వాధ్యక్షుండై దామగ్రంథినామంబున నలరు సుగుణమండితుండు నకులుండు సుమీ. గోపాలకముఖ్యవృత్తిం గొని తంత్రీపాలుండను నామంబు దాల్చి రూపజితమన్మథుండైన యీతండె సహదేవుండు. మాలిని యను పేరం బరఁగి సైరంధ్రీవేషంబున సద్వృత్తిఁ జెలంగి సుధేష్ణాదేవికడ నున్న యీపావనశీల ద్రుపదమహీజాని కుమారిక యని తెలియుమా. ఈసాధ్వీతిలకమునకై కాదె మహాపరాధియగు కీచకుని నక్తమంబున రహస్యప్రకారంబున భీముండు పొలియించె.

భీముఁడు:—విరాటమహీరమణా! విధివశంబున షండరూపంబు నొంది కన్యకామణులకు నృత్తగీతవాద్యవిశేషంబులఁ గఱపుచు బృహన్నల యను పేరఁ బ్రఖ్యాతి గాంచిన యీతఁడే యర్జునుఁడని యెఱుంగుము. ఖాండవదహనంబు తఱి నాఖండలు నోడించి, కాలకేయాది దానవుల నింద్రుపనుపున రూపుమాపి, యామహేంద్రు నర్ధాసనంబునఁ గూరుచున్న యదృష్టశాలి యీఘనుండే యని తలంపుమా.

ఉత్త:— ఈమహామహుండే నన్ను సమరాంగణమున రథంబుపైఁ గూర్చుండఁజేసి కౌరవులనెల్ల జయించిన మహాత్ముండు.

విరా:—(అర్జునుం గౌఁగిలించుకొని) మహానుభావా! నాకులంబునుద్ధరించితివి. నీఋణంబుఁ దీర్ప నేనెంతవాఁడ. (ధర్మరాజునకు నమస్కరించి) ధర్మనందనా.

క. తెలిసియొ తెలియకయో నేఁ
బలికిన మాటలకు నెల్లఁ బాటింపక యి
మ్ములఁ గరుణం గావుము
సులలిత సత్కీర్తి సాంద్ర! కౌంతేయేంద్రా! 7

భృత్యానుభృత్యుండను. నాచేసిన యపరాధము లన్నియు క్షమింపవలయు. దక్షిణగోగ్రహణంబున నన్నుద్ధరించితి. ఉత్తరగోగ్రహణంబునఁ గౌరవుల బారిఁ బడకయుండ నాతనయునింగాపాడితివి. ఇదంతయు నీరాజ్యంబ. మేమెల్ల నీపాదసేవకులము. ఈరాజ్యంబు చేకొని మమ్ముఁ గాపాడుము.

ధర్మ:—మహీనాయకా! దుస్తరంబగు నజ్ఞాతవాససంవత్సరంబు నీప్రాపు నిస్తరించితిమి. నీచేసిన తప్పులు లేవు. ఉన్నను అవి స్మృతికి వచ్చునవి కావని నమ్ముము.

ఉత్త:—జనకా! మనకు రాజ్యమెక్కడిది? నిన్న నేఁడు వీరుజయించి యిచ్చినది కదా యీరాజ్యము. కావున నుత్తరను గానికగా నీవలయు.

## ౧౬ పాట.

విరా:—సంతోషము సంతోషము (ఉత్తరను బిల్వఁబంచి) ధర్మనందనా! ఈముద్దియ నాకొమరిత. ఈకన్నియ నర్జున కిప్పింపుము. ఇదియ నాకోరిక.

ధర్మ:—(అర్జునుం జూచును)

అర్జు:—విరాటభూపా! ఈ కన్నియ నాకుఁ గోడలగుఁ గాక. అదియే యుచితము.

విరా:—(పరమానందముతో) అర్జునుని వియ్యమునునాతకంటె వేఱుభాగ్యము నాకుం గలదే. త్రిలోకాధిపత్య మబ్బినట్లే అట్లు పరిగ్రహింపుఁడు.

ఉత్త:—జనకా! చాలుబాపి అభిమన్యుని శ్రీకృష్ణమూర్తిం బిల్వనంపుము. శుభముహూర్తము త్వరలో జరుపవలయు.

విరా.—మంచిది.

(అని యందఱు నిష్క్రమింతురు.)

(వివాహమండపము, పాండవులు శ్రీకృష్ణుఁడు విరాట ప్రభృతులు ప్రవేశించుచున్నారు.)

విరా:—శ్రీకృష్ణా! నేఁటికి నాగృహము పవిత్రమాయె నాజన్మము ఫలించె. నీమేనల్లునకు నాపుత్రిక నొసఁగితి. మీతో బంధుత్వము గూడఁ గల్గినది.

శ్రీకృ:—విరాటమహీరమణా! పాండవులతో సంబంధము నీకుఁ గుదిరినది. కృతకృత్యుఁడవు.

విరా:—ఈవధూవరులను జక్కఁగ నాశీర్వదింపుఁడు.

శ్రీకృ:— పెద్ద లందఱితోఁ గలిసి నేను నాశీర్వదించెద. వివాహ కృత్యమును నడపుఁడు.

పురో:—(వివాహకృత్యము జరపుదురు)

శ్రీకృ:—ధర్మనందనా! మీకష్టములు గట్టెక్కినవి. సుదినములు [1]రానున్నవి. విరాటునితో బంధుత్వము గలిగినది. ఇట్టి నీకింక నేమిలోపముండును?

ధర్మ:— శ్రీకృష్ణా! మీయాదరమును విరాటుని బంధుత్వము గల్గు మాకేకొదువలును లేవు. అన్నియు ఫలించినవియే. అయిన నిట్లగుఁగాక.

తే. ధరణి బహుసస్యసంపదల్ ♦ పరఁగుఁ గాక
క్షితిపులకు న్యాయ్యబుద్ధియే ♦ చెలఁగుఁ గాక
[2]జనుల కారోగ్యభాగ్యముల్ ♦ పొసఁగుఁ గాక
ధర్మదేవతవృద్ధిచేఁ ♦ దనరుఁ గాక. 8

## ౨౦ పాట.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

([3]ఇది నిర్వహణసంధి)

ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్ర కవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశి కుముదినీమిత్ర సుబ్రహ్మణ్య మనీషిపుత్ర, తాండవకృష్ణాపరాభిధేయ, శేషాద్రినామధేయ విరచితంబగు, పాండవాజ్ఞాతవాస నాటకమునందు సప్తమాంకము.

సర్వము సంపూర్ణము.

---

1 కావ్యార్థోపసంహార మగుట నిది సంహృతి.

2 శుభశంసన మగుట నిది ప్రశస్తి.

3 ఫలప్రాప్తి కార్యానుకూలంబుగ నిర్వహణసంధి మూఁడంకములయందును గలిపి పొంగంబుగ వర్ణితము.

# పాండవాజ్ఞాతవాసము.

---

## పాటలు.

౧ పాట. (సూత్రధారుఁడు)—

నాటరాగము. రూపకతాళము.

పరమేశ, జగదీశ, పాపావళీవినాశ॥
పరిపాలితదేవేశా, భక్తమనోనివేశ॥పర॥ ౧
నారదముఖమౌనివరా, రాధన సంతతమోదా।
శ్రీరమణీవామాంక, స్థితబుధస ర్వాభీష్టద॥ పర॥ ౨
నిగమాంత, సంచారా, నిర్మలభక్తవిచారా।
జగదానందప్రచారా, శాశ్వతసుఖకర, భయహర॥ పర॥ ౩

---

౨ పాట (ధర్మరాజు)—

ధనాసరిరాగము. రూపకతాళము.

తరుణీ, మణి, యీ, ద్రౌపది, తానెఱుఁగదుకష్టమ్ముల॥ తరు॥
అనవరతముపతిసేవల, నాచరించుచుండుసాధ్వి॥ తరు॥ ౧
కలయందైనను నొరులను, దలఁపనిమానితశీల,
పలువురసేవించుచునే పగిదిమెలఁగఁగలదోయింక॥ త॥ ౨
హర్మ్యమ్ములలో నెప్పుడు, నమితసుఖములొందునింతి
యన్యులగృహములమెలఁగఁగ, నౌనో యెన్నఁ జాలనింక॥తరు॥

---

3 పాట (ధర్మరాజు)—

కమాజ్ రాగము. ఆదితాళము.

ధర్మదేవతా, దయయుంచిప్రోవుమిపుడు॥ ధర్మ॥
మున్నునీదు, కరుణఁగాదె, సన్నుతులగు సోదరులను
బన్నములను, బొందకుండఁ బాలించుకొ, నంగఁగంటి॥ ధర్మ॥ ౧
నీవెతండ్రి, నీవెతల్లి, నీవెసోదరుఁడవు సఖుఁడవు
నీవెరక్షకుఁడవునాకు, నేఁడునాఁటివరములనిమ్మిక॥ ధర్మ॥ ౨

---

౪ పాట (ధర్మజభీముల సంవాదము)—

జోగిరాగము. ఆదితాళము.

ధర్మ—పడరానిబాములు, గుడిచితిమందఱు, నడవిలోనొకచోఁ
బడితమ్ములారా॥ పడ॥
భీము—అదియాయదనున, మదిఁజేర్పఁగనేలా, తుదముట్టు మన
వగ, గదధర్మరాజా॥ అది॥
ధర్మ—ఒకరొకరేయిఁక, నొగులుచుఁగాలము, నొకవత్సరమును
నిఁకఁబుచ్చఁదగుఁజుమ్ము॥ పడ॥
భీము—ఆర్తియేటికి కృష్ణుఁడా ర్తరక్షుఁడుమన, కీర్తినిలుపుటకుఁ
గర్తయైయుండఁగ॥ అది॥

---

౫ పాట. (ద్రౌపది)—

కానడరాగము. ఆదితాళము.

ఈశాంతమేమున, యిడుములకుమూలము, నీశాలురెవ్వరు, దీనిని
మెచ్చరు॥ ఈశాం॥
కాలముగనిక్రోధ, మూనిశాంతమును, మానినఁ గార్యము,మానక
ఫలియించు॥ ఈశాం॥ ౧
కానికాలమున, మానులవలెమునుఁ, బూనినఁ జెడుఁగద, కార్య
ముల్॥ ఈశాం॥ ౨
మానసీయనీకు, నెఱుఁగరానిధ,ర్మముగల దేన్నైన, గానిదెల్పితిని॥
ఈశాం॥ 3

---

౬ పాట. (దుర్యోధనశకునికర్ణదుశ్శాసనులకు సంవాదము.)—

ఇంగ్లీషునోటువలె ఏకతాళము.

దుర్యో.—మనముపంపిన చారులరిగి, జనపదములఁ గనివచ్చి
నారే॥
శకు.—పనిపితి, యుక్తుల బహుభంగులనే, ర్పితి వారింకనురారు
నృపా॥ పని॥
కర్ణ.—మనవైరులుధర మనియున్నారో, విధివశమున మృతిఁ, గని
నారో, తెలియక యేపని, నొనరింపందగదు. రా—జా॥
దుశ్శా.—వారలీధారుణింబాసియే యుందుర, వ్వారికై యేల విచా
రముం బూనంగ॥

---

౭ పాట. (భీముఁడు)—

కమాచురాగము. ఆదితాళము.

వినుమా ద్రౌపది భీముని పలుకులు వృథగావివి॥ విను॥

అన్నగారి యానతి మీఱ । ననువు గాదు నాకునో, వన్నెలాడి నీ వెఱుం
గుదు గదలే, కున్నాఁ డే శత్రులఁ జంపనే॥ విను॥ ౧

నీకవమానము నేకరణి నైనదో, సాకెతిఁగింపుము బోకార్యును॥ విను॥

---

౮ పాట. (కీచకుఁడు)—

బ్యాగురాగము. ఆదితాళము.

ఎవరీనారీ, యెఱిఁగింపు వేగ॥ ఎవరీ॥

సువిమలాంగము, సొంపుగూర్చెడు, చొక్కపుం బంగారు బొమ్మ
యిది॥ ఎవరీ॥

పతియెవండో, యతివయిదియున భవనము, ననుండ, గనేలొకో॥
ఎవరీ॥

వినఁగ గోరెద దీని విధమును వీనుల, లాఁగఁ, దెల్పుమికఁ॥ ఎవరీ॥ ౨

---

౯ పాట. (సుధేష్ణ)—

కమాస్ రాగము. ఆదితాళము.

వినుమా సోదరా, వివరింతు, నాకుఁ దోఁ। చిన వార్తలెల్ల॥ విను॥

వనిత, యిదినా, మాన్యయని, మనము, నందల, పోయవలదు॥ విను॥

కలదు, పతులే, వురుదనకని, గంధర్వులంచు మున్నె తెలిపె॥ విను॥

ఎవ్వ, రపకృతి, సేయుదు, రోహా, రివ్వసుధఁ, బ్రాణ, ములమన
రఁట॥ విను॥

---

౧౦ పాట. (కీచకుఁడు)—

శంకరాభరణము. ఆదితాళము.

నినుమింం, చినకాం, తలఁ గనజాలా, యినినిజము ॥ నిను॥
వనిత, వినుము, నాదు, మనవి, తనివి, చన, న్నినుఁ గాంచిన,
వినుత, ముః క్తి, యబ్బినటులె, యని తలఁచెద, నిజము
సుమ్ము ॥ నినుమింం॥

---

౧౧ పాట. (సైరంధ్రి)—

బిలహరిరాగము. రూపకతాళము.

పరసతులఁగోరుటేగద పాపము । అది నరకకూపము॥
బలవంతు లెందఱోమును । పరనారులఁగోరి చెడరె ॥ అనుపల్లవి.
మునువినవె రావణాదులు మోహంబున నేమొనరిచి । మూఢు
లగుచు మోసపోయి । ముక్తిదూరులగుచుఁ జెడిరి॥ పర॥
వరకులమున జనియించితి । భాగ్యంబున నలరారితి । వరయగొప్ప
దనముఁ బోవఁ । బరునిపత్ని వాంఛింతువె॥ పర॥ ౨
కనుమా మునుపెవ్వరైనఁ । గాని యట్టివాంఛఁ బూని । కడ తేరిన
వారుగలరె । కామమ్మునఁ జెడెదవేల॥ పర॥

---

౧౨ పాట. (భీముఁడు)—

మోహనరాగము. రూపకతాళము.

వినుమా మోమోటమెల్ల । విడిచి నాదుమాట రమణి॥ విను॥
అనుమానమేల సింక । నణచెద నాయధము । శపథము॥ విను॥ ౧
రేపు కీచకుఁడు భీముఁడు । చూపట్టరు పృథివిలోన ।
నా పౌరుషంబుఁజూడుము । తాపము దీర్చెద నిజముగ॥ విను॥ ౨
త్రిజగము లొక్కటివచ్చిన । దేకువ నీవైగిఁజంపి ।
తీర్చెదనీ పెనుతాపము । ధీరవగుచుఁ బొమ్ము వేగ॥ విను॥ 3
చండగదా దండమిపుడు । సన్నిధిలేకున్న నేమి ।
భండనమున నాముష్టియె । పరునిఁ ద్రుంపఁగాఁజాలదె॥ విను॥ ౪
త్వరపడకుము సరియనకుము । బిఱుసుగ మాటలననకుము ।
తరుణీ సంకేతమునకుఁ । దాను వచ్చు విధమొనర్చు॥ విను॥ ౫

---

౧౩ పాట. (కీచకుఁడు)—

శహానరాగము, రూపక తాళము.

సరోజనేత్ర, బ్రోవుమా, విరాళికోర్వనే,
బిరాన కోర్కిదీర్పవే, మరుండు క్రూరుఁడే॥ సరో॥ పల్లవి.
రుచిరాంగి నినువలచి, మిగుల వెతలఁజెందితిలే,
వెతఁబాయ నధరమొసఁగవే, బ్రతిమాలుచుంటినే॥ సరో॥ ౧
సుకుమారి యభీష్టము, వికలము గను జేయకే,
సకలంబునైన రాజ్యమిత్తు, సౌఖ్య మొసఁగవే॥ సరో॥ ౨

౧౪ పాట. (ఉత్తర)—

కల్యాణిరాగము. రూపకము.

మనబృహన్నలా। సారథ్యము న। ఘనుఁడుగ, గ్రహింపుమా॥ మన॥
ఖాండవమును గాల్చునపుడు। కడుమైత్రిని। నర్జునునకు।
గాదిలి సారథియట। ఘనుఁడు। నితఁడు। సుగుణరతుఁడు॥మన॥ ౧
విద్యయందు। వినీతియందును। వినయమందు, సములు లే।
రాద్యుఁడితఁడే ఘనులలోనే। విద్యనైన నెఱుఁగునుగద॥ మన॥ ౨

౧౫ పాట. (ఉత్తరుఁడు, బృహన్నల)—

ఇంగ్లీషునోటు. ఏకతాళము.

ఉత్త—వచ్చినారట। కౌరవు, లుమన, పౌరుషం, బును గాంచ॥
వచ్చి॥
బృహ—వింటినేనును। గోధనంబును। తఁటరు। లుగొని। పోయి
ర, టంచును॥ వింటి॥ ౧
ఉత్త—నాకుసారథి, లేమి నెంచెద। నీకునాపని యందు। నేరుపు।
పాకరిపు। సారథికివలెనే। పారునంచును। వింటి బళిబళి॥
వింటి॥ ౨
బృహ—లేదునాకని। యేలపల్కఁగ। నీదుపూన్కికిఁ దగినరీతిగా।
గాదు।గానియొనర్తు। గౌరవ। మేదినీపతీ। గర్వమార్పుదు॥
వింటి॥ ౩

౧౭ పాట. (ఉత్తరుఁడు)—

ఇంగ్లీషునోటు. ఏకతాళము.

వినుమా, రథమును, గొని, వేగఁ, జనకయుండఁ, గడుదవ్వు,
వచ్చినార, మింక, నోయి, సారథీ, క్షణమిందు నిల్పుమా, బలు
సైన్య, ములునవే। వినుమా॥ ౧
మదిని, పిధం, బిదం, తయును, బృహన్నలా, నిజం, బుగా,
దలంచి, చూడనిమ్ము, వేగనిల్పుమా, రథమెంత, దూరమో, గొని
పోక, నిల్పుమా॥ వినుమా॥ ౨

---

౧౮ పాట. (బృహన్నల)—

మోహనరాగము. రూపకము.

పరుగిడఁదగునా, పగఱునగరే॥ పరు॥ పల్లవి.
పంతంబుఁ బూనుము, పార్థివ, తనయ, యిటుల॥పరు॥ అనుపల్లవి.
అరినికరముల, నురుశరములను, బర, పియు, ముని, ఘురినిగనగ,
నరుగఁజేతు॥ పరు॥ ౧
ధీరుఁడ, వై భయ, దూరుఁడ, నగు న, నుగని, భయము, గొనకు॥
పరు॥ ౨
నేనీకు, ప్రాపయి, చేరితి, మదని, దిగులు, వదల, కయిటు॥ పరు॥ 3

---

౧౯ పాట. (ద్రౌపది)—

బేగడరాగము - చాపుతాళము.

భూమిపాల, సద్గుణజాల। నీవెఱుఁగవె ధర్మ, నియతి సచ్ఛీల॥ భూ॥
పల్లవి.
దాంతియుక్తుఁడునయి, శాంతుఁడౌ యతిరక్ష, మెంత భువింబడు,
నంత యాపదగల్గు॥ భూ॥ ౧
నీతియుతుం డిత, డాతతసత్కర్మ, పూతుఁ డటంచు ను, ఖ్యాతిని
ఱుంగవే॥ భూ॥ ౨

---

౧౯ పాట. (విరటుఁడు)—

బిలహరిరాగము. రూపకతాళము.

మోదమయ్యె, మదినినెంతయుగ్, ఈదినంబున, నాదగు. కోరిక, లాదరం,
బొప్పగఁ, దీర్పుఁడు, వేగమే॥ మో॥ పల్లవి.

సన్నుతిఁ జేసెద, సద్భక్తి మీాఱఁగ, చిన్నికూఁతురిగొని, నన్ను మన్నిం
పుఁడు॥ మో॥ ౧

నామనవినివిని, నరునకుఁ గాన్కగా, నాకన్నెను త్వరగ్, జేకొనఁగోరెదగ్॥
మోద॥ ౨

---

౨౦ పాట. మంగళము.—

శహాన. రూపకము.

శ్రీరమాపతే, వారణవర, భారశమిత, శ్రీరఘువంశాబ్ధిచంద్ర, తే, సుమఙ్గళమ్॥

భూరిభక్త, వారమానస, భరణా, వారిజాస, నాదిదివ్య, ధారితాంఘ్రి,
కమలయుగళ॥ శ్రీరమా॥ ౧

దశరథవర, తనయా, శ్రీశ, లోక, పాలకా, శశధర, ధరసువందిత, పా
వన, విశద, నృపాలకా, వరదా, కుజనహరణ, త్రిజగన్నుతాంగ,
శ్రీకర, లోకవిమోహక, సుఖదాయక॥ శ్రీరమా॥ ౨

---

ఈక్రిందిపాట 39 పుటలో 17 పంక్తిలోనిది.

(కీచకుఁడు)—

బ్యాగ్ రాగము. ఆదితాళము.

ఆహాహా, త్రిలోకసుందరిరా, వహవా, నాకెవితగురా. అహ॥ పల్లవి.

ఇది యున్ననదృష్టమురా, కుద, రనియెడ నదియే, దురదృష్టమురా, కడుఁ
గష్టమురా, సెబాసు॥ అహాహా॥ అనుపల్లవి.

కరములు హేమలతలురా, నిరుపమముఖమరవిందమురా, గళముదరము, పరి,
మళముతనువురా, వరదంతములుసుమకుట్మలములౌరా॥ అహాహా॥

నడుము సింహమునునొంపగ్, నాభియు జలధిగభీరతముంపగ్, నఖములు
చంద్రునడంపగ్, నాతిపదంబులు, చిగురులఁద్రుంపగ్॥ అహాహా॥

---

ఈపాట 44 పుటలో 21 పంక్తిలోనిది.

(ద్రౌపది)—

**ముఖారిరాగము. రూపకతాళము.**

కటకటాపావనీ, యిటు లవమానముగల్గెఁగా॥ కట॥ పల్లవి.

పటుబలశాలినై, బవరంబులోనరి, బలములఁజెండతివిగదా॥కట॥ ౧

పాండవపత్నినై, భంగమునొందునటు, పాడుదైవమిటువ్రాసెగా॥ కట॥ ౨

నీదసన్నిధినుండి, నే దీనురాలనై, యీదుష్టమతిచేత నవమానమొందితి॥ కట॥ ౩



చెన్నపురి : వావిళ్ళప్రెస్సున ముద్రితము. —1921.